వీనులవిందొనగూర్చు అమరగానములతో !
నవరసభరితములైన నృత్యములతో !!
నేత్రపర్వమగు దృశ్యములతో !!!
బ్రహ్మాండమగు సెట్టింగులతో !
అద్భుత సన్నివేశములతో !!

ఆబాలగోపాలమును ఆనందింపచేయ

వచ్చుచున్నది! వచ్చుచున్నది!!

శ్రీ వెంకట్రామా పిక్చర్సువారి మహోత్తర పౌరాణిక చిత్రం


అద్దంకి

# బ్రహ్మరథం


పారుపల్లి

| కవి: | సంగీతం: | నృత్యం: | ఆర్టు: | స్టూడియో |
|---|---|---|---|---|
| బలిజేపల్లి: | మోతీబాబు: | వెంపటి: | శర్మ: | శోభనాచల |

దర్శకుడు:— చిత్రపు నారాయణమూర్తి, బి. ఏ.

తారాసందోహం

అద్దంకి, పారుపల్లి, శిగల, రఘురామయ్య, ఏ. వి. సుబ్బారావు, కంపట్ల, యం. సి. రాఘవన్, రామారావు, రామూర్తి, వి. కోటీశ్వరరావు, డి. సదాశివరావు, డి. సత్యం, శ్రీనివాసరావు, సి. హెచ్. సుబ్బారావు, నాగమణి జయమ్మ, సరోజ, సౌదామిని, టి. కనకం, చిట్టి, శ్రీరంజని, కుమారి అనసూయ

ఇంకా అనేకమంది

ఆంధ్రా:— పూర్ణాపిక్చర్సు, గాంధీనగర్, బెజవాడ
రాయలసీమ:— మల్లికార్జునపిక్చర్సు, నంద్యాల
నైజాం:— దక్కన్ ఫిలిం డిస్ట్రిబ్యూటర్సు, హైద్రాబాద్

# కృతజ్ఞత

శ్రీమతి సీనకా పాపాయమ్మగారు ఆంధ్ర మహిళా సభకు వెయ్యి రూపాయిలు ఉగాది కానుకగా విరాళమిచ్చి మహిళా సభ రాజపోషకులుగా ఎన్నుకోబడ్డారు వారికి మా కృతజ్ఞతా పూర్వక వందనాలు

శ్రీమతి కాశీనాథుని రామాయమ్మగారు యీ ఉగాది సమయములో దేశోద్ధారక నాగేశ్వరరావు శిశు సంరక్షణాలయం ఉపయోగార్థం రెండువందల యాభై రూపాయిలు విరాళ మిచ్చారు వారికకూడ మేము కృతజ్ఞులం.

శ్రీమతి వె జమునాబాయి,
శ్రీమతి ఎ చన్నఘంటమ్మ కృష్ణారావు
కార్యదర్శినులు.

నాది నాది నాది




నాది నాది నాది

# అమృతాంజనము

గాని,

" యథాయథా................కాళీధవళత్వ శంకయా."

అమృతాంజనమా ! నీ కీర్తి ముల్లోకములను దెల్లఁజేయు పూసికతో పెరుఁగు
చున్నప్పుడెల్లను, నా నల్లని ముంగురులు, దెల్లబడునేమోయను భయముచే
నా హృదయము మిక్కిలి పరితాప మొందుచున్నది సుమా !!!

# ఆంధ్ర మహిళ


మైలాపూరు :: ఏప్రిల్ 1947 :: మదరాసు





సంవత్సరం చందా  అయిదు రూపాయిలు




సంపుటి 3 ఏప్రిల్ 1947 సంచికలు 21, 22

# "సర్వే జనా సుఖినో భవంతు"

'వ్యయ' సంవత్సరం ప్రపంచాన్నంతనూ, విస్తార వ్యయ-ప్రయాసల్లో పెట్టి, పోయింది ఎప్పుడో ముగిసిన యుద్ధాల ఫలితాలు యింకా అనుభవిస్తూనే యున్నాం. నిత్య జీవితంలో అత్యావసరాలైన కూడు, గుడ్డ, నూనె వగైరా లన్నీకూడా కరువుగానే యున్నాయి ప్రజలు తహ తహలాడిపోతున్నారు. చర్చిల్ 'లిక్విడేట్' చేయజాలనన్న బ్రిటిష్ ఇంపీరియాలిజం యొక్క కూకటివేళ్లు అతడి కళ్లెదుటనే కదిలిపోతున్నాయి. ఇండియాలో నెహ్రూ ప్రభుతుల్లాంటి జాతీయ నాయకులతో ఇంటీరియం ప్రభుత్వం యేర్పడింది. భారతదేశ భావిరాజ్యాంగ విధానాన్ని నిర్మించడానికి ప్రజాపరిషత్తు, ఢిల్లీలో సమావేశాలు జరుపుతుంది. పాకిస్థాన్ ఆశ సడలే కొద్దీ నవఖాలీదురంతాలూ పంజాబ్ అల్లర్లూ తలలెత్తేయి. శాంతిదూతా ప్రేమ మూర్తియైన గాంధిమహాత్ముడు ఏకమాత్రుడై గ్రామ గ్రామాల్లో కాలినడకను సంచారంచేస్తూ ప్రేమ సందేశాన్ని చాటుతున్నాడు

ఇంలాటి పరిస్థితుల్లో 'సర్వజిన్నా'మ సంవత్సరం— 'సర్వోభద్రాణి పశ్యతు" ఓర్పుగల వాళ్లకు అన్ని శుభాలూ చేకూరుతాయంటూ, 150 ఏళ్లు ఓర్చుకున్న వాళ్లు మరొక్క సంవత్సరం ఓర్చుకోవాలంటూ చల్లగా ప్రవేశించింది. ఇండియా పరిపాలనా బాధ్యత ఇండియన్లకే వదలిపెట్టి బ్రిటిష్ ప్రభుత్వం మరొక్క సంవత్సరంలో వైదొలగ నిశ్చయించిందని ప్రకటించడం, వైస్రాయి వేవల్ స్థానే మౌంటాబేటన్ రావడం వగైరాలన్నీ చరచరా జరిగేయి. బ్రిటిష్ ప్రభుత్వం చిత్తశుద్ధితోటే యీ ప్రకటన గావించింది, మీలో మీరు ఐక్యత నలవర్చుకోండని వాళ్లూ, మేమూ శాంతిగా న్యాయంగా పరిష్కరించుకోడానికే ప్రయత్నిస్తున్నామని జిన్నా బృందంవారూ అంటున్నారు. ఇప్పటికే—

## "సర్వే జనా సుఖినో భవంతు"

'Earth is sick, and Heaven is weary
of the hollow words that kings and
statesmen utter
when they speak of Truth and Justice!'

అందుచేత యిప్పుడైనా జిన్నా సోదరుడు వివేకంతో కలిసి వస్తాడని, ఆంగ్లేయులీ ఆఖరుసారైనా అన్నమాట నిలబెట్టుకుంటారని ఆశించవచ్చు. మూడో పార్టీ తప్పుకుంటే సఖ్యత అదే యేర్పడుతుందని భారతీయులంతా విశ్వసిస్తున్నారు

ప్రపంచమంతటా వివిధ వర్గాలవారూ వైషమ్యాలు చంపుకుని ప్రజాక్షేమ దృష్టితో వ్యవహరించవలసి యుందని ప్రబోధం జరుగుతుంటే, మన మద్రాసులో అతి శోచనీయంగా పార్టీలో పార్టీలు బయలు దేరడం, వ్యయ సంవత్సరం ఆఖరు అమావాస్యనాడు క్రొత్త మంత్రి వర్గం యేర్పడ్డం జరిగింది. "పదవుల వ్యామోహం పాటింపక మీరైనా కొంత కాలంపాటు స్థిర పడియుంటే, ప్రజా క్షేమ దృష్టితో కృషిచేస్తారనుకుంటున్నామని అటు గవర్నరూ, ఇటు రాష్ట్రపతీ హెచ్చరించడంకూడా జరిగింది.

ప్రభుత్వాలు మారవచ్చు, సామ్రాజ్యాలే సమసిపోవచ్చు, స్వరాజ్యమూ రావచ్చు, వచ్చినా సర్వజనులకు భద్రం - సుఖం - శాంతి లభించాలంటే ఒక్కటే మార్గముంది భారత దేశానికి 'నిర్మాణ కార్యక్రమం' కంటె మరొక మార్గం లేనేలేదు అహింసా సిద్ధాంతం వినా ప్రపంచానికి అన్యథా శరణం నాస్తి. ప్రభుత్వం ప్రజలు మహిళా సంస్థలు మొదలైన వన్నీ ద్విగుణీకృతోత్సాహంతో నిర్మాణ కార్యక్రమం నడిపించవలసియుంది. ఇదే ఉగాది సందేశం. ఇదే మనకు గాంధిమహాత్ముడి సందేశం. గాంధీజీ చాల దూరదృష్టితో యీ నిర్మాణ కార్యక్రమ అష్టదశ సూత్రాల్ని, (అందులో మత సామరస్యాన్ని ముందుగానుంచి) మనకు ప్రసాదించేడు

సర్వజిన్నామ సంవత్సరం సర్వజనులకు సర్వ శ్రేయస్సులు సమకూర్చుగాక; సర్వ-జాతి-మత కుల-కక్ష-వైషమ్యాలు సమసిపోయి, "సర్వ జనో సుఖినో భవంతు" అన్న సుజనాశీస్సులు ఫలించుగాక! "భారత దేశంయొక్క అజ్ఞాన దైన్యాల్ని పారదోలి ఈ అర్ధశతాబ్దంలోపునే మరల అపూర్వ మహోన్నత స్థితికి దోడ్కొని వచ్చెద" మని అమోఘ ప్రతిజ్ఞలు గావించిన తపోశాలుల ప్రతిజ్ఞలు నెరవేరుగాక!

"మీ కతమున నా దాస్యము,
ప్రాకటముగఁ బాయునని పలుకెదలోనం
జేకొని, యూఁవడి, నిర్గత
శోకస్థితి నున్నదానఁ . . . . "

నని భారత మాత తన సంతానాన్ని అర్థిస్తున్నదని గమనించి మాతృదేవత శృంఖలావిమోచనానికై ఎల్లరూ ఏకాశయంతో కృషిచేసి అచిర కాలంలో కృతార్థులగుదురు గాక!! ప్రజలందరూ సమానావకాశాలతో ఆనంద సుఖ శాంతులతో వర్ధిల్లెదరు గాక!!!

"సర్వజనో సుఖినో భవంతు"



# సూర్యారాధన

శ్రీ వేదుల సత్యనారాయణ శాస్త్రిగారు

( 1 )

కమనీయంబగు నీస్వరూపమును నేగాంక్షింపఁగా దేవ! వే
దములెల్లన్ నినుద్వాదశాత్ముఁడనుచున్ దార్కాణమున్ జూపునీ
సమయానన్ భవదీయరూపమును సాక్షాత్కారమొందింపఁగా
సమయంబీ రథసప్తమీదినము ఓచ్ఛాయా మనోవల్లభా!

( 2 )

అరుణుండెక్కి తయారుచేసె రథమున్నాలస్యమింకేలనో
కరుణాసాగర!! సాప్తికాశ్వజవమున్ సర్ధాగవీక్షించుచున్
కరమొప్పారగ నంజలించి తరుణుల్ గల్పించు పూసెజ్జలన్
చరణంబుల్ వెసనిల్పవేడెదనునోచ్ఛాయామనోవల్లభా!

( 3 )

ఏనాడెక్కితివో రథంబుధరపై కింతేనియున్ రావునీ
వీనాడైనను విశ్రమింపుమిదిగో యీరత్నపీఠస్థలిన్
నానాసూనవితానవాసనల నీనామంబునర్చింపఁగా
చానల్ తుల్సికి చుట్టుచేరిరికదా? చ్ఛాయామనోవల్లభా!

( 4 )

విరిజాజుల్ వెసఁదెచ్చిపూజలిడెదర్ వింజామరల్ వీచెదర్
మురళీనాద సమానగాత్రములతో మోదంబుఁగాఁబాడెదర్
కరమొప్పారగ పాయసాన్నములతోఁగల్పింత్రు నైవేద్యముల్
సరదాతీరగ పొంగలిందినగదే? చ్ఛాయామనోవల్లభా!

( 5 )

వేళయతిక్రమించె యలివేణులు బంగరుపూలసజ్జతో
మాలలుఁదెచ్చి పూజలిడిమంగళహారతులన్నతింపఁగా
సోలుచుభక్తితో నెదురుచూచుచునుండుదు రెండవేళతో
దోలుము నీరథంబునతితొందరగాఁ నిఁక నేఁడుభాస్కరా!

( 6 )

చక్కసిరోజునేఁడు రథసప్తమి పుణ్యపతివ్రతాంగనల్
చక్కని యావుపాలనొకచేరెడు బియ్యముపోసిపొంగురా
చక్కరఁజల్లి పొంగలినిచక్కగవండి నివేదనంబిడన్
ఒక్కొకచిక్కుడాకు ననునొప్పగనుంచిరి చూడుభాస్కరా!

( 7 )

కరువలిదారిలోఁబడి యెకాయెకిఁబోయెదవేమి దేవ! నీ
చిరుతముఖారవిందమున చిమ్మెను స్వేదతుషారసంతతుల్
పరుగులుమాని మా తులసి పజ్జ వసింపుము పుష్పచామరం
బరమరవీడివీచెదము హాయిగ నీశ్రమ బాపభాస్కరా?

( 8 )

చిక్కుడకాయలన్నిపుడు చిత్రశతాంగ మొనర్చివారమీ
వెక్కిన! సప్తలోకముల నంచరణంబొనరింపవచ్చు మా
మక్కువగుఱ్ఱముల్ రథమమాంతముగాఁ గదలింపఁగల్గునా
రిక్కలదారి నొక్కడవు రేయిబవళ్లు వసింపఁజెల్లునే?

( 9 )

ఎన్నిదినాలుగా నుపవసించెదమో భవదీయరాకకై
మిన్నులడిగ్గి మద్గృహ సమీపములో నతిచెన్నుమీరునీ
వన్నెల తుల్సికోట తరువాకిటిచందున విశ్రమింపు మా
కున్న ఫలప్రసూనములనొప్పగ నీకిడిదోయిలించెదమ్.

( 10 )

— పాతివ్రత్యము —

అంచుపాటలుపాడు చత్వాదరమున
పూజలొనరించు భారతీ పుణ్యవతులు
తులసికోటకుచుట్టును దోసిలొగ్గు
మేనుపులకింప రథసప్తమీ దినాన.



# ఉగాదికాన్క

శ్రీమతి ద్రోణంరాజు లక్ష్మిబాయమ్మగారు

రావమ్మ! రావమ్మ! రావే ఉగాది!
సర్వజిత్తుభమూర్తి! స్వాగతమమ్మ!
భారతరమణుల ప్రాభవశక్తి,
ఆంధ్ర మహిళలమేటి అమృతంపుప్రతిభ
చతురబ్ధివలయి తత్స్మాచక్రసీమ
మ్రోయింపవమ్మ! నీమోహనమురళి!
సర్వజిన్మంగళా శాసనావాప్తి
సర్వశోభన సుభిక్షామధుదీప్తి
తెలుగుకమ్మని నేల మొలచినచేల
బంగారుపంటల పాలతేనియల
నవ్యజీవశ్రీల నాదాలు రేపి
పాడవేమాతల్లి! మాణిక్యమహతి!
ప్రళయప్రపంచ కరాళోగ్రపీడ
వ్యయమయ్యె హైందవావనిశక్తిబాధ!
కాటకదేవత కరకుదృక్కులను
అణగారిపోయేటి అనాదజీవాల
కడుపునిండాకూడు కట్టుకోగుడ్డ
నిలువనీడాయిచ్చి నీవేలుకోమ్మ!
క్రొత్తకైసేతలు క్రొత్తపోకడలు
క్రొత్తఆదర్శాలు క్రొత్తభావాలు
జయహిందుగా! పూర్ణస్వాతంత్ర్యసిద్ధి!
మచ్చలేనీక్రొత్త మనసుదీపాల
నిండునివ్వాళులు నీవందుకోమ్మ!
తెలుగుతల్లీ! కూర్మి దీవింపుమమ్మ
యుగములువెలిగిన సొగసులసొబగు
పిండినక్షీరాలు బిడ్డలకిమ్మ!
తెలుగుపున్నెపుతల్లి! తేజస్సు మెరయ
సర్వవిద్యా కళాశాలాప్రశస్తి!
చేయెత్తిదీవింపు శ్రీయాంధ్రమహిళ!
జయ! విజయీభవ! జయ

ఆంధ్ర మహిళ



ఈ క్రింది కేంద్రాలలో జనులు తండోపతండాలుగా చూస్తున్నారు!

శ్రీ లక్ష్మి : బెజవాడ :: న్యాషనల్ : గుంటూరు

శ్రీ కృష్ణా : రాజమండ్రి :: పూర్ణా : విశాఖపట్టణం

త్వరలోనే ఇతర కేంద్రాలలో విడుదల

పూర్ణా పిక్చర్సు వారి

# జైహింద్!










Apply to: POORNA PICTURES
BEZWADA



సర్వజిన్నామసంవత్సరాదిని, చారిత్రాత్మకమైన ఇంద్రప్రస్థ నగరం (పురాణఖిల్లా)లో ఇండియా ఆహ్వానంపై సమావేశమైన అఖిల ఆసియా ఖండ మహాసభలో అధ్యక్షోపన్యాసాన్నిస్తూ,

శ్రీమతి సరోజినీనాయుడు శంఖారావం :—

మన ప్రాచీన విభవోజ్జ్వలస్థానాన్ని మనమంతా స్మరణకు తెచ్చుకుని మన ఆసియా ఖండంలో శాంతిస్థాపనతోబాటు యావత్ ప్రపంచానికి వెలుగుబాటలు నిర్మిద్దామని మిమ్మల్ని ఆహ్వానించేం. ఆసియా ఖండ దేశదేశాల విజ్ఞాన సాంస్కృతుల్లో భిన్నత్వాలున్నా అవి మన సర్వతోముఖ వికాసానికి తోడ్పడుతూ ఐక్యతకే సాధనభూతం కాగలవని నేను విశ్వసిస్తున్నాను; ఇదే పండిత నెహ్రూ ఆశించేది; ఇదే మహాత్మా గాంధీ ఆశించేది.

# ప్రపంచ కథలు

ఎంతటి ధనవంతులైనా నిరుపేదలైనా, విద్యాధికులైనా అజ్ఞానులైనా, సంతానాపేక్షకు లోను కావడం మానవ లోకానికి స్వాభావికమైంది. సంతాన సిద్ధికోసం అనేక నోములు, వ్రతాలు, తీర్థయాత్రలు పుణ్యపురుషసందర్శనాలు చేస్తారు.

తోటమాలి భార్య సీతమ్మకు వివాహమై పదిహేను సంవత్సరాలైంది. తోటమాలి రామన్న, పగలల్లా తోటలో పడ్డ శ్రమను తీర్చుకోవాలనే యోచించకుండా సీతమ్మతోపాటు రాత్రిపూట భజనలకు జాతరలకు బైలుదేరేవాడు. వీలైనప్పుడల్లా ఒక కోడిపెట్టను మొక్కుకునేవారు దంపతులు. అంతకు మించి అర్పించాలన్న వాంఛ లేకపోలేదు కాని త్రాణలేనందువల్ల అంతటితోటే తృప్తిపడేవారు ఆ పేద దంపతులు.

మొత్తానికి తోటమాలి భార్య సీతమ్మ నోములు ఫలించాయి. అందులో పుత్రసంతానం. పశిమి మామిడిపండు, సీతమ్మ సగర్వానికి ఆనందానికి మేరలేదు. రామన్న ఉత్సాహంతో తోటను మరింత ఏపుగా పెంచి మొక్కల వ్యాపారాన్ని నానాటికి అభివృద్ధి చేస్తున్నాడు

తోటమాలి భార్యకు పుత్రప్రాప్తి కలిగిన తర్వాత పుట్టింటివారెవరూ రావడానికి సావకాశం చిక్కలే. అయినా తను వెళ్ళి అయిదు సంవత్సరాలౌ వచ్చింది గనక దసరా రోజుల్లో ఒక్కసారి వెళ్ళి ముసలివాళ్ళిద్దరికి చూపించి వచ్చేద్దాం అనుకుంది. కొద్దిరోజులైనా పుట్టింట హాయిగా కళ్ళనిండా నిద్రపోయి, కడుపునిండా భోజనంచేసి నోటినిండా తన కొడుకు ముచ్చట్లు నలుగురికి చెప్పుకుని రావాలన్న గంపెడు ఆశతో, రామన్నను అందుకు ఒప్పించింది.

ఆవేళనే గులాబీ మొక్కలు అమ్మిన నీద వచ్చిన సొమ్ముతో కొత్తలాగు కొక్కా తెచ్చాడు రామన్న. స్వయంగా టిక్కట్టుకొని రైల్లో కూర్చోపెట్టి, బండి కదలే ముందు పిల్లవాడిని మరొకసారి ముద్దుపెట్టుకు సాగనంపాడు.

మైదానాలు, కాలవలు, వంతెనలు కొండగుహలు ఒక్కొక్కటే వెనక్కి పరుగెడుతున్నాయి. వాటిని జూస్తూ కిటికీ దగ్గర కూర్చుని రివ్వుమని వేస్తున్న చల్లని కొండగాల్లో కొడుకు హాయిగా ఆడుకోటం చూచి సీతమ్మ ఉప్పొంగిపోయింది

స్టేషన్ దిగగానే తిరుగుబండి మాట్లాడుకుని ఆప్టే పొద్దుబోకముందే ఇల్లుచేరుకుంది. త్రోవలోనే నిద్రపోయాడు కొడుకు. తల్లిదండ్రులకు కొంచెంసేపు చూపించాక మళ్లీ పరుండబెట్టవచ్చునని లేపింది. కాని పిల్లాడు ఒక్కసారి కళ్లుతెరిచి మళ్లీ పరున్నాడు. బడలికగా వున్నవాణ్ణి లేపడం ఎందుకని వాళ్లుకూడా వారించడంచేత పోనీ అని, అన్ని ముచ్చటలు తనే చెప్పడం ప్రారంభించింది.

రోజు తనకన్న ముందుగాలేచి జుట్టుపీకిలేపే బిడ్డ ఈవేళ తనకు మెలకువవచ్చి అంతసేపైనా ఇంకా నిద్రలేవక పోవడం సీతమ్మకు అదోలా అనిపించి గబగబా పిల్లాణ్ణి లేపింది. వొళ్లు కణకణా చింతనిప్పులు. ఎందుకో ఆయాసంకూడా. సీతమ్మ తల్లి దగ్గరకివచ్చి, రైలుగాలికి జలుబుజేసిందని అనగానే సీతమ్మ గుండెల్లో పెద్దరాయి పడినట్లయింది. ఎంత సంతోషంతో బైలుదేరిందో అంత కృంగిపోయింది.

రెండురోజులపాటు పిల్లాడిపక్క వదలకుండా అక్కడే కూర్చుంది, వెయ్యిదేవుళ్లకు మ్రొక్కుకుంటూ. జ్వరం హెచ్చుతోందిగాని తగ్గు కనిపించదు. భర్తకు కబురుచేద్దా

## తోటమాలి భార్య

మంటే వెళ్లేమనిషి ? ఈలోగా గత్యంతరం. వైద్యుడేనా లేని వూళ్లో పడేశావేవిటి దేవుడా అని ఆక్రోశించింది

పిల్లాడినిచూసి నిబ్బరం తెచ్చుకుని తిరిగి మూటాముల్లె కట్టింది ఏమైనాసరే స్వగృహంలోనే వైద్యంచేయించాలని. ఇంత జబ్బులో ప్రయాణం కూడదన్నారు. అయినా సరే, గాల్లో దీపం పెట్టేబదులు ఎలాగో కొంపజేరితే ఎంత సొమ్మైనా ఇచ్చి ఏ వైద్యుడు కాళ్లమీద నేనా పడేయొచ్చునని బండిలో పడుకోబెట్టింది నిండాకప్పి. బండి స్టేషన్ చేరగానే పిల్లవాడిని లేవతీసి భుజాన్నివేసుకుని రెండడుగులు నడిచేసరికి ఎప్పుడూ లేనంతటి బరువుగా ఉన్నట్టు తోచింది ఆమెకు. “కాళ్లు ఇంత చల్లగా ఉన్నాయేమిటి ? బండిలో గాలి తగిలిందేమో, ఆయాసమంతాపోయి ఇలా కదలకుండా ఉన్నాడేం! దేవుడా ఏంచేశావు నా బిడ్డని. ఈ మారుమూలస్టేషన్‌లో నాకు దిక్కెవ్వరు.”

పోనీ వెనక్కిపోదామనుకుంటే వెళ్లి ప్రయోజనం ? ఇప్పుడు గత్యంతరవేవిటి ?

లోపలనుంచి దుఃఖం తాడి ప్రమాణాన్న పొల్లిపొర్లి వస్తోంది. నోరారా విలపిద్దామంటే ఏమో !

రైలు ఊరగలు వేసుకుంటూ, నిప్పులు కక్కుమంటూ వచ్చి పడింది స్టేషన్‌లో, చెదిరిపోయిన మనస్సును కుదటపరచుకునేలోగానే.

మూట చేత్తోపట్టుకుని అప్రయత్నంగా స్టేషన్‌లోకి సాగింది. “రైల్లో ఎక్కనిస్తారా ? కూడా ఉన్న అమ్మలక్కలు అభ్యంతర పెట్టరుకదా ? నిండాకప్పి వొళ్లో పడుకోపెట్టుకుంటేసరి.”

ఆడవాళ్ల పెట్టె ఖాళీగానే కనిపించింది. అందులో ఒక మూల కూర్చొని రైలు కదిలాక ఒక్కసారి భోరుమని ఏడవాలనుకుంటుంది. ఇంతలోకీ ఎక్కడనుంచో తయారయ్యారు ఇద్దరు అమ్మలక్కలు. రైలు గడగడా నడవడం ప్రారంభించింది. అదృష్టవశాత్తు కూడావున్న ఇద్దరూ ఏమీ మాట్లాడలేదు. తన ఆలోచనలో, తన అగాధంలో తాను మునిగిపోడానికి ఆస్కారం కలిగింది. “అసలు ఈ పిల్లాడు పుట్టకపోతేనేం ? ఏవిటి మాయ ? దీనంతకు అర్థవేవిటి ?”

తలుపుమీద తట్టుతూ టిక్కెట్టు కలెక్టరు ప్రవేశించటంతో సీతమ్మ ఒళ్లు ఒక్కసారిగా జలదరించింది పిల్లవాడి ముఖంమీద గుడ్డ బాగా కప్పి తన టిక్కెట్టు చూపించింది.

పిల్లాడి వయస్సు ?”

“రెండేళ్లుదాటి మూడువచ్చాయి.”

మూడేళ్లకే అంత పొడుగా ?

‘మరే ! తండ్రిపోలిక మొన్న శ్రావణ మాసంలోనే వెళ్లాయి రెండేళ్లు. పడుకోటంవల్ల పొడుగ్గా ఉన్నట్టు కనిపిస్తున్నాడు. నుంచుంటే ఇంతా అని చేత్తో చూపించింది.

టిక్కెట్టు కలెక్టరుకి నమ్మకం కుదిరినట్టు కనపడక, కంఠం సవరించుకుని, నీరుకమ్మినకళ్లు కొంచెం తుడుచుకుంటూ- “ఈ మధ్య జబ్బుచేసింది. అలసటవల్ల నిద్రపోతున్నాడు. లేస్తే ఏడుస్తాడేమోనని ” అని ఏమోమో అయోచితంగా చెప్పపోతుండగా అవతల బల్లమీదున్న ముసలమ్మ అందుకుంది “అవును కొందరు పిల్లలు ఏడ్పు మొదలుపెడితే అంతం వుండదు. రైలు ఎక్కిందిమొదలు దిగేవరకూ ఒకటే గోల పెడతారు. నీపుణ్యమా అని లేపడం మాత్రం లేపకు ” అన్నది.

సరేనని నసుక్కుంటూ టిక్కెట్టు కలెక్టరు చక్కా వెళ్లాడు.

అమ్మయ్యా ? అనుకుంది సీతమ్మ. కాని ఈ నటన ఏవిటి. ఇంకా ఈ కపటం దేనికి ! లేకపోతే మధ్యలో దింపేస్తారేమో !

“మీ పిల్లాడు చాలాసేపు నిద్రపోతున్నడే ” అంది ముసలమ్మ చటుక్కున. సీతమ్మ అదిరిపడుతూ “అవును చాలా సేపైంది. అలసట తీరక ఎంతో జబ్బుపడి లేచాడు. ఇప్పుడు కులాసాగానేవుంది దేవుడిదయవల్ల ” అన్నది వికటంగా నవ్వుతు

ముసలమ్మ సహజంగా మాటకారి కాకపోవడం రక్షించింది మారుప్రశ్నలు లేకుండా రైలు టకటకా ముందుకు పోతోంది. చుట్టుప్రక్కల గిరగిరగా తిరుగుతున్న వృక్షజాలంతోపాటు సీతమ్మతల గిరగిరా తిరిగిపోతోంది.

పక్క బల్లమీద కూర్చున్న సన్నటి ఆవిడ సీతమ్మ కేసి చూసి “పిల్లలుగల ఇంట్లో ఆనందం తాడవిస్తుంది ” అంది.

“నిజవే అంతకన్నా కావలసిందేవుంది.”

“నాకు పిల్లలు లేకపోయినా రోజూ అనిపిస్తో వుం

టుంది ఆ మిషిన్‌మీద కూర్చుని గౌనులు కుడుతున్నప్పుడు. ఎంతో జాగ్రత్తగా కుట్టాలి. ఏమాత్రం తేడావచ్చిన మా యజమానురాలుకి ఎంతో కోపం వస్తుంది."

"లేసుగౌనులు మీ షాపులోవేనా ?" అని ప్రశ్నించింది తోటమాలి భార్య

"ఒక్క లేసుగవును లేమిటి సిల్కువి, పట్టువి, రంగులవి అన్నీను.' ముందు రిబ్బన్లు వేసి ఎంతో చక్కగా కుడతాం ఊ! . కాని ఏం లాభం అన్నీవూళ్లో వాళ్ల పిల్లలకే గదా!"

"మావాడికీ గౌనులెందుకు."

ఇంతలోకి ముసలమ్మ అందుకుంది "నీకు పిల్లలులేరుగనక అలా మురిసిపోతున్నట్టున్నావు ఎందుకమ్మా చిన్నతనంలో ఏ ఏడాదిపాటో ఆ సంతోషం. ఎదిగిన తరవాత చూడాలి. ఆ చెడ్డ సాహవాసాలు, ఆ అబద్ధాలు ఒకటే గొడవ. విశ్వాసఘాతకులు ఎంత దూరంగా ఉంటే అంత మంచిది."

వెంటనే సీతమ్మ పిల్లాడిని దగ్గిరగా తీసుకుని 'నా పిల్లాడు అలాంటివాడు కాదమ్మా.' "ఒక్కసారి అల్లరి చేయడు. వాడి ఆటేవిటోవాడి పాటేవిటో-వాడి నిద్రే విటో వాడిదే." అని వెంటనే పరిస్థితిజ్ఞప్తికి తెచ్చుకుని తిరిగి మౌనం వహించింది.

ముసలమ్మదృష్టి పిల్లవాడిమీదే వుండటంచూసి—

"ఇంకనిద్రలేస్తాడనుకుంటాను ఎప్పుడూ ఇంతసేపు లేదు .." అంటూ ఏదోదో మాట్లాడడం మొదలుపెట్టింది తన కొడుకునిగురించి తోటమాలి భార్య, నోట వచ్చేమాటలు ఆమెకే అర్థం కావడంలేదు. కూడావున్నవారికి అంతకన్నా ఆమె మనస్సు చెలించిందనివారు గ్రహించ లేకపోలేదు. ఆమె తన బిడ్డ ఇంకా తనదగ్గరే వున్నాడని ఒక కృత్రిమ ఆనందంలో మునిగిపోయింది. అయోచితంగా అశ్రుధారలు ఆ తల్లి నేత్రాలనుంచి రాలి బిడ్డపై పడుతూనే వున్నాయి. రైలు బండి మరింత వేగంగా వారిని ఎగరవేసుకు పోతోంది.

—స్కాండినేవియా కథకు అనుకరణ

- వినాయక్ -



# ఆంధ్రమహిళ సముఖమునకు....

అమ్మా,

మార్చి సంచికలో ప్రచురింపబడిన మీ 'సభ్యురాండ్ర చర్చ' చదివాను. చాలా బాగుంది. బాల్య వివాహములు, స్త్రీ విద్యవంటి పాతబడిన సమస్యలనే యీనాడుగూడా డిబేటింగు సొసైటీలలో చర్చించడం కద్దు. అట్లుగాక నవీనమైనటువంటివీన్నీ, అభ్యుదయ సూచకమైనటువంటివీన్నీ విషయములను చర్చించుటకు మీ విద్యార్థినుల కవకాశం కలుగజేయడం బాగుంది కాని మద్రాసు ఆంధ్ర మహిళా సభయే "సాముదాయక భోజనశాలలు అనవసరమని" తీర్మానించడం ఆశ్చర్యం కలుగజేసింది. వీటివల్ల కుటుంబాల్లో పరస్పరానురాగం క్షీణిస్తుందని శ్రీమతి కస్తూరి రంగనాయకమ్మగారు చెప్పినదానిలో సబబులేదు. సమిష్టి కుటుంబాలలో పరస్పరానురాగం క్షీణిస్తోందా? సమిష్టి జీవితంవల్ల ఒకరియందొకరికి అనురాగం హెచ్చుతుంది జాతిలో సంకుచిత స్వభావం పోగొట్టి, విశాలమైన దృక్పథం అలవరచాలంటే సాముదాయక భోజనశాలలు అత్యంతవసరం. "కులమత భేదాలున్న మన దేశంలో సాముదాయక భోజనశాలలు వీలుపడదు" అని మీ అధ్యక్షురాలు కామరాజు మైత్రేయిగారు అనడం చాలా విచారకరం. మన పతనానికి కారణం కుల మత వైషమ్యాలేకదా. వాటిని నిర్మూలించడానికి సాముదాయక భోజనాలయాలు సహాయకారిగా వుంటాయి కాబట్టి ప్రతిపాదకులు ఆమోదించుటకు బదులు ప్రతి ఘటించడం పరిహాసాస్పదం.

యం వరలక్ష్మి, విశారద,

శ్రీకాకోళం.

అమ్మా,

కమ్యూనిస్టు రష్యాలో అమలులోవున్న వన్నీ అద్భుతమైన విషయములనీ, వాటిని మనదేశంలోగూడా స్థాపించాలనీ ఒక వెర్రి అపోహ వ్యాపించివుంది అందుచేతనే కాబోలు ఆంధ్ర మహిళాసభ సభ్యురాండ్రు కొంతమంది "సాముదాయక భోజనశాలలు" కావాలి అని వాదించారు ఇంటికొక కుంపటి అయితే కాలం వృధా అవుతుందని, ప్రతీవూళ్లోనూ సాముదాయక భోజనశాలలు యేర్పరిస్తే స్త్రీలకు తీరిక యేర్పడుతుందనీ, ఆ తీరికను సద్వినియోగం చేయడానికి అవకాశం యేర్పడుతుందనీ వారివాదన ఆ వాదనకు సరియైన సమాధానం రంగనాయకమ్మగారే చెప్పారు. "ఇంట్లో పనివాళ్లనుపెట్టి వంటచేయించుకోగల శక్తిలేనివాళ్లు భర్తల సహకారాన్ని తీసుకొని ఇద్దరూకలసి సంసారం ఎక్కాబెట్టుకోవాలి" అనడం యెంతో సమంజసంగా వుంది కాస్తనేతగరిట యిల్లా అందుకోండి అంటేనే విసిగించుకొని భర్తలు ముందుగా యీ విషయం నేర్చుకోవాలి

సి త్రిపురసుందరి,

నాగపూరు.

అమ్మా,

"ఆంధ్రులకు అంకెలు లేవా?" అనే వ్యాసంలో శ్రీయుత చోళ్ల విష్ణుగారు మన నాయకులకూ, పత్రికలకూ మాంచైన 'డోసు' యిచ్చారు. మన పత్రికలలోనూ, పుస్తకాలలోనూ యింగ్లీషు అంకెలనే వాడడం సిగ్గుచేటని మీరే ఒప్పుకున్నారు. కాని 'ఆంధ్ర మహిళను' తిరగేస్తే ఎక్కాడా తెలుగు అంకెలే కనిపించలేదు. "Physician cure thyself" అన్న యింగ్లీషు సామెతను మీకు జ్ఞాపకం చేస్తున్నందుకు క్షమించండి.

జి హరిరావు,

వీరభద్రపురం.

## పాఠకుల లేఖలు





# రాజకీయాలు

## సామ్రాజ్యాధికారానికి స్వస్తి

బ్రిటీషు ప్రభుత్వం 1948 సంవత్సరం జూన్ మాసంలో మన దేశంనుండి నిష్క్రమించడానికి సమ్మతించారని మార్చి ఆంధ్రమహిళలో వ్రాసాము. ఆలోగా కాంగ్రెసుకు, ముస్లిం లీగుకు సఖ్యత కుదిరి, యిద్దరూ ప్రజాపరిషత్తులో పాల్గొని భారతదేశ రాజ్యాంగ ప్రణాళికను తయారు చేస్తే ఆ ప్రణాళిక ప్రకారం యేర్పడ్డ భారత ప్రభుత్వానికే వారి అధికారాన్ని వప్పచెప్పుతారనీ, అట్లు కాని పక్షంలో ఆ అధికారాన్ని ఒకే ఒక కేంద్ర ప్రభుత్వానికి హస్తగతం చేయాలో, లేక కొన్ని ప్రాంతాలలో రాష్ట్ర ప్రభుత్వాలకి గాని, మరి యే యితర ప్రదేశాలకిగాని ఆ అధికారాన్ని వప్ప జెప్పాలో ఆలోచిస్తారనీ గూడా తెలియజేసాము. జాతీయ సంస్థ కాంగ్రెసు యొక్క కార్యనిర్వాహక వర్గం యీ ప్రకటనను అమోదించింది 1942 సంవత్సరంలో సాగించిన "క్విట్ యిండియా" పోరాటం యొక్క వుద్దేశం యిదే కాబట్టి! మన దేశాన్ని పరప్రభుత్వ దాస్యంనుండి విముక్తి చేయడమే కాంగ్రెసుయొక్క లక్ష్యం. నేడు బ్రిటీషు ప్రభుత్వం తన సామ్రాజ్యాధికారానికి స్వస్తి చెప్పుకొంటోంది అంటే కాంగ్రెసు సంతోషించదా? అయినా, '48 జూన్‌లోగా భారత దేశంలోని ప్రభుత్వ వ్యవహారాలు సక్రమంగాను, ప్రజాస్వామిక పద్ధతిపైనా చక్కబెట్టడానికి వీలుగా వుండేటట్టు ప్రస్తుతమున్న కేంద్ర ప్రభుత్వమును 'డొమినియన్' లలోవలె క్యాబినెట్‌గా పరిగణింపవలెనని కాంగ్రెసు కోరుతోంది. కేంద్ర ప్రభుత్వం జాతీయమై యుండి, ప్రభుత్వ సభ్యులలో అంతఃకలహాలు లేకుండా ఏకాగ్రత కలిగివుంటేకాని మన దేశం 1948 జూన్ నాటికి బ్రిటీషువారినుంచి స్వాతంత్ర్యమును పొందుటకు శక్తివుండదు అందుచేతనే కాంగ్రెసు యీ విధంగా తీర్మానించింది. దీనిని బ్రిటీషు ప్రభుత్వం మన్నించి వారి ప్రకటనలోని నిజాయితీని స్పష్టపరుస్తారో లేదో చూడవలసి యున్నది. లార్డు వేవల్ స్థానే వచ్చిన లార్డు మౌంట్‌బేటన్ యీ విషయమై త్వరగా చర్య తీసుకోవలసి వుంటుంది. 'క్విట్' చేసిన వైస్రాయి వేవెల్ ముస్లిం లీగ్‌కి అడంగా నిలచి కేంద్ర ప్రభుత్వ ఐక్యతను విచ్ఛిన్నం చేసాడు. మైనారిటీ పార్టీ అయిన లీగ్‌ను తల దువ్వుతూ దేశంలో అరాజకాన్ని ప్రోత్సహించాడు అందుచేతనే తన వైస్రాయి పదవికి తిలోదకం వదలవలసివచ్చింది. మౌంట్‌బేటన్ దొర యొక్క నైతిక నడవడిపైననే మన దేశముయొక్క భవిష్యత్తు ఆధారపడివుంది ప్రజాపరిషత్తులో చేరి, అధిక సంఖ్యాకులతో రాజీపడి, భారత జాతీయ విజయానికి దోడ్పడితేనే ముస్లిం లీగుకు రాజకీయ భవిష్యత్తు వుందని, కేంద్ర ప్రభుత్వంలో స్థానం వుంటుందనీ, అట్లుకాక దేశాన్ని విభజించి రక్తపాతం చేయడానికి తలపెడ్తే ముస్లిం లీగ్‌కూడ భారతదేశంనుండి 'క్విట్' చేయవలసి వస్తుందనీ మౌంట్‌బేటన్ ముస్లిం నాయకులకు నచ్చ జెప్పగలిగితేనే తప్ప దేశానికి ప్రస్తుతంలో మోక్షంలేదు. ఈ మాత్రం చేయడానికి మౌంట్‌బేటన్‌కూ, బ్రిటీషు ప్రభుత్వానికీ శక్తి, ధైర్యమూ, నిజాయితీవుందా అనేదే ప్రశ్న నేటి మన రాజకీయాలలో.

## జిన్నా — చర్చిల్

బ్రిటీషు ప్రభుత్వ ప్రకటనపైన మీ అభిప్రాయం యేమిటి అని జిన్నా సాహేబ్‌గారిని అడిగితే సమాధానం యేమీ యివ్వలేదని, యింగ్లండులోవున్న అభివృద్ధి నిరోధకులైన తన స్నేహితులు—చర్చిల్ అండ్ కంపెనీవారు—ముస్లిం

లీగ్‌కు యెంతవరకూ సహాయ పడగలరో పూర్తిగా అవగాహన అయేవరకూ జిన్నా గారు మాట్లాడరనీ మార్చి సంచికలో విశదీకరించాం. భారతదేశానికి స్వాతంత్ర్యం యివ్వడానికి తల పెట్టిన లేబర్ ప్రభుత్వంపై చర్చిల్ దుమ్మెత్తి పోసాడు. మా తాతలు, ఎందరో 'మహానుభావులు' కపటంచేతా, కత్తి చేతా సంపాదించిన సామ్రాజ్యం మనం వదులుకుంటున్నామే అని చర్చిల్, అతని కన్సర్వేటివ్ స్నేహితులూ కంటతడి పెట్టారు. కాని వారి మాట గడ్డిపోచకింద తీసేసింది బ్రిటీషు ప్రజ; 48 జూన్‌లో ఇండియానుండి వెడలిపోతామని చేసిన ప్రకటనకు ఇంగ్లండులోని ప్రజాభిప్రాయం సమ్మతించింది. పాపం జిన్నా సాహేబుకు ఎవరు దిక్కు? తన స్వశక్తి పైననే, తన అనుచరుల భుజబలంపైననే ఆధార పడాలనుకున్నాడు. దీని పర్యవసానమే పంజాబులోని ఘాతుక చర్యలు!

## పంజాబు వధలు - రాష్ట్ర విభజన

పంజాబు రాష్ట్రంలో నూటికి 30 మంది హిందువులు, 30 మంది శిక్కులు, 40 మంది మహమ్మదీయులూ వున్నారు. అందుచేతనే పంజాబులో బాధ్యతాయుత ప్రభుత్వం అమలులోకి వచ్చినప్పటినుండీ మిశ్రమ మంత్రివర్గం (కొలిషన్ గవర్నమెంటు) పరిపాలనను సాగిస్తోంది. ఈ మంత్రివర్గంలో ముస్లింలతోబాటు హిందువులూ, శిక్కులూగూడ పరిపాలనాబాధ్యత పొందివున్నారు. ఈ సఖ్యత జిన్నా సాహేబ్ గారికి గిట్టలేదు. నూటికి పదిమంది ముస్లింలు ఎక్కువున్న పంజాబులో రాజరికాన్ని పూర్తిగా ముస్లింలే చలాయించాలిగాని యీ హిందువులూ, శిక్కులూగూడా యెందుకు అని ఆయన అహంభావం. అశాస్త్రీయమైన శాసనోల్లంఘనోద్యమాన్ని లేవదీసి కొలిషన్ మంత్రి వర్గాన్ని కూలదోసాడు. పక్కా ముస్లిం లీగు మంత్రివర్గాన్ని ప్రతిష్ఠ చేయడానికి హంగులన్నీ యేర్పరచాడు. కాని, హిందువులూ, శిక్కులూ యీ అవినీతికి పాల్పడతారా? అయితేనేం మాకు భుజబలం వుందన్నారు ముస్లిం దుండగీండ్రు. శిక్కు గోపురాలను, హిందూ దేవాలయాలనూ పడగొట్టారు; అమృతసర్‌ను తగలపెట్టారు; సుమారు రెండువేల హిందువులను, శిక్కులను బలిచేసారు. సుందరతరమైన పంజాబు స్మశానవాటిక అయిపోయింది? కాని, హిందూ శిక్కు నాయకులు ధైర్యంతో పరిస్థితులను యెదుర్కొంటున్నారు. హిందూ శిక్కుజాతులలో జీవం వుండేదాక పంజాబులో పాకిస్తాన్ యేర్పడదు! పంజాబులో హిందువులు, శిక్కులు అధిక సంఖ్యాకులుగావున్న ప్రదేశాలు విడదీసి మిగతా భాగంలో కావలిస్తే మీ పకిస్థాన్‌ను యేర్పరచుకోండి అని అంటున్నారు. ఈ సూత్రాన్ని కాంగ్రెసుగూడా ఆమోదించింది. గగన కుసుమాన్ని ఆశిస్తోన్న లీగ్ గొంతుకలో వెలక్కాయ పడినట్లయింది. ఇదే విధంగా బెంగాల్‌నిగూడా విభజిస్తే పాకిస్థాన్ 'హుళక్కి' అయిపోతుంది కాదూ! స్వయం నిర్ణయ సూత్రం సాకుచెప్పి యిటు బెంగాల్‌ను అటు పంజాబు, సింధు సరిహద్దు రాష్ట్రాలను వేరు చేసి పాకిస్థాన్‌ను ప్రతిష్ఠించమన్న ముస్లిం లీగ్—ఏం జవాబు చెప్తుంది ఆ స్వయం నిర్ణయ సూత్రం ప్రకారమే పంజాబును బెంగాల్‌ను విభజించాలి గదా! సగం పంజాబు, సగం బెంగాలు జారిపోయిన పాకిస్థాన్ తల, కాళ్లు లేని మొండెం అయిపోతుంది!

## మద్రాసు రాజకీయాలు

మార్చి సంచికలో మన రాష్ట్రంలోని రాజకీయాలను చర్చిస్తూ, "ప్రకాశవంతమైన ప్రభుత్వమే చిరస్థాయిగా వుంటుందో లేక సుస్థిరముకాని యే యితర ప్రభుత్వమో గద్దె యెక్కుతుందో యెవరికి తెలుసు?" అని వ్రాసాము. రాష్ట్రపతి కృపాలినీ మద్రాసులో మకాంచేసి, అధోగతిపాలయిన మన రాజకీయాలకు ఒక ఆకారం దిద్దాడు. ఆ ఆకారం ప్రజా శ్రేయస్సుకు తోడ్పడగలదో లేదో యిప్పట్లో చెప్పడం కష్టం. ప్రజా స్వామ్యానికి ముఖ్యసూత్రం తలల లెక్కమటుకే అని ఒప్పుకుంటే యీ కొత్త ఆకారం ప్రజా స్వామ్యపద్ధతినే యేర్పడిందని చెప్పాలి. పాత ప్రభుత్వానికి అధ్యక్షుడు సైమన్ కమిషన్‌ను గర్జించి తుపాకీ గుండ్లకు ఛాతీనిచ్చిన ఆంధ్రకేసరి. నూతన ప్రభుత్వ ప్రధాని ఓమాందూర్ రామస్వామి రెడ్డియార్ తమిళ కాంగ్రెస్ నాయకులలో ఒకరు. శాసన సభా నాయకుడు డాక్టర్ పి. సుబ్బరాయన్ కాంగ్రెస్ కోటగుమ్మం కేసి పెడ మొగం పెట్టిన రోజులలోనే యీ యన ప్రధానామాత్య పదవి నలంకరిం

చాడు. తదుపరి రాజాజీ శిష్యరికం చేసి జాతీయ పోరాటంలోగూడ పాల్గొన్నాడు. మన తెలుగు మంత్రులు బెజవాడ గోపాలరెడ్డి, హెచ్. సీతారామరెడ్డి, కల్లూరి చంద్రమౌళి,వుత్సాహంతో కార్యభారం నిర్వహించగల యువకులు రాఘవమీనన్‌గారి బదులు మాధవమీనన్‌గారు మంత్రి అయారు; గిరిగారూ, కోటిరెడ్డిగారు, కె. భాష్యంగారు కొత్త ఆకారంలో యిమడలేదు. ఆరోగ్య శాఖకు రుక్మిణమ్మగారి స్థానే డాక్టర్ రాజన్ మంత్రి అయారు; రుక్మిణమ్మగారు ప్రకాశంగారి పట్ల విశ్వాసం కలిగివుండమే ఆమె దోషంలాగ కన్పిస్తోంది కళా వెంకట్రావుగారు కూడ మంత్రి వర్గంలో ఉన్నారు. ప్రజాభిప్రాయానికి ఎదురీది, ప్రకాశం మంత్రి వర్గ పతనానికి కారకుడైనా వెంకట్రావుగారి దేశభక్తిని శంకించడానికి వీలులేదు. ఆయన ‹ సారధ్యం › వుంటే—'42 విప్లవోద్యంవలె నాదార్ రాజాజీ వుద్యమంగూడా దేశాభ్యుదయానికి తోడ్పడగలదని ఆశింపవచ్చు.

ప్రకాశంగారు ధీరుడు కాబట్టి నిండు మనస్సుతో క్షమించగలిగే శక్తివుంది. ఆశక్తితోనే నూతన మంత్రి వర్గానికి తన ఆశీర్వాదం యిస్తారని నమ్మవచ్చు. అధికారం వుంటేనే కొంతమంది వెలుగులోకి వస్తారు. ప్రకాశం ప్రధాని కాకపోయినా ఆంధ్ర ఆయన ప్రజాహృదయంలో ప్రకాశిస్తోనే వుంటాడు.





# వనితా విజ్ఞానము

"హరిమయము విశ్వమంతయు,
హరివిశ్వమయుండు సంశయము పనిలేదా
హరిమయముగాని ద్రవ్యము,
పరమాణువు లేదు . "

అంటూ నేను భాగవతంలో ఒక ఘట్టం మెల్లగానే చదువుకుంటున్నా, ఎక్కడనుంచి విన్నాడో మా రామం, "ఆఁ! పరమాణువంటే జ్ఞాపకం వచ్చింది—ఈ సారి పరమాణు ప్రపంచంలో ప్రయాణం చేద్దా మనుకున్నాం కదూ? శాస్త్రపరిశోధనలు, మొన్న మొన్ననే కనుక్కొగలిగిన రహస్యాలు, మన పూర్వులు అనేక శతాబ్దాలకు పూర్వమే ఎలా కనుక్కొగలిగేరో అని మొన్న నీవు చెప్పిన శ్రీరామకృష్ణ సుభాషితం విన్నప్పటినుంచీ ఆలోచిస్తూనే యున్నాను, నిత్యా!" అంటూ దగ్గరకు జేరేడు. (ఇదివరలో పొడి పొడివి, మిడి మిడివియైన శాస్త్ర లెక్కలంటే చెవి కోసుకునే రామం మన పూర్వులు అత్యంత రసవంతంగా చెప్పిన సూత్రాలకూ వీటికీ సమన్వయం చేయ ప్రయత్నించడం చూచి, వాడి దృక్పథంలో మార్పుకు లోపల ఆనందిస్తూ) "సరే,అలాగే ప్రయాణం చేద్దాం, అప్పటి నీ విమానం ఉందా, ఊండిందా!" అన్నాను. "మన కింక ఆ విమానంతో పని లేదు, సూక్ష్మ దర్శని యంత్రాలూ, ఎలెక్ట్రానిక్ మైక్రాస్కోపులూ, సైక్లోట్రాన్లూ కావాలీసారి" అన్నాడు. "ఐతే, కానీయి—నీవు చెప్పదలచుకున్న దంతా"నని హెచ్చరించే. ఇక అందుకున్నాడు రామం "శాస్త్రజ్ఞులు ప్రపంచంలోనున్న ప్రతీ పదార్థమూ కూడా ఎలా యేర్పడిందోనన్న రహస్యం తెలుసుకోవాలని పృదక్కరణలు చేసి చేసి మన భూమి, భూగోళంమీద పదార్థాలే గాక, సూర్యమండలం, నక్షత్రమండలాలు వగైరా సర్వమూకూడా 92 రకాల ధాతువులు (Elements) వల్ల యేర్పడ్డాయని కనుక్కున్నారు. వీటిల్లో రెండుగాని, మూడుగాని, ఇంకా యెక్కువగాని వివిధ పరిమాణాల్లో కలియడంవల్ల సంయోజక (Compound) పదార్థాలేర్పడ్డాయన్నారు. ఉదాహరణకు ఉదజని, ప్రాణవాయువు అనే రెండు గాలులు కలిపి నీరైంది, ఈ రెండు గాలులూ, బొగ్గూ కొన్ని పాళ్ళల్లో కలిస్తే పంచదార యేర్పడింది, క్లోరీన్ అనే విష గాలీ సోడియం అనే ధాతువూ కలిస్తే మన నిత్యోపయోగమైన ఉప్పు ఐంది, ఇలాగే ప్రపంచ పదార్థాలన్నీను "అన్నాడు. "అసలు ఆధాతువులెలా యేర్పడ్డాయో ఏమైనా పరీక్షించేరా?" అని ప్రశ్నించేను "ఓ! ప్రతీ పదార్థమూ 'అణువు'ల (Molecules) సమూహం అన్నారు. ఈ అణువు 'పరమాణువు' (Atom)ల వల్ల యేర్పడిందని కనుక్కున్నారు చాల కాలంవరకు పరమాణు వంటే పరమాణువే—మరి దాన్ని భేదించడానికి వీల్లేదన్నారు; గాని యిటీవల జె. జె థాంమ్సన్‌గారు వీటిని పగలగొట్టి చూపడంతో ఆ సిద్ధాంతాలుపోయి, అన్ని రకాల పరమాణువులూ గూడా ఎలెక్ట్రాను (Electron), ప్రోటాను (Proton)ల వల్లనే యేర్పడ్డాయని, ఇవి వేరు వేరు విధానాలుగా అమర్చుకొని ఇన్ని రకాల ధాతువుల్నీయిచ్చే యని తెలుసుకున్నారు" అని ఆగకుండా జవాబు చెప్పేడు (వాళ్ల దృక్పథం ఎలాగున్నా రామం దృక్పథంలో మార్పుగలగడం చూచి ఆనందిస్తూ ఇలా గన్నాను) "ఐతే, శాస్త్రం ఎప్పుడూ నిజమే కాని, అబద్ధం చెప్ప దంటారే! శాస్త్రజ్ఞులుకూడా అప్పుడప్పుడు 'బొడ్డుకు తువ్వ' అని, అన్నది మళ్లీ కాదని, ఇలా రాద్ధాంత సిద్ధాంతాలు చేస్తూనేయుంటారన్న మాట!" అని నవ్వేను.

---

భిన్నత్వంలో ఏకత్వమే బయటబడింది

---

"అదికాదే, శాస్త్ర పరిశోధనలంటే సృష్టిరహస్యాల్ని అవగాహన చేసుకోడానికి జరిగించే కృషిగాదూ? సృష్టి రహస్యాలు—ఇదిగో నమ్మా—మమ్మల్ని తెలుసుకోండని యెదురు పడతాయనుకున్నావా? పరిశోధనలు జరగ్గా జరగ్గా క్రొత్త క్రొత్త రహస్యాలు అవగాహనమౌతుంటే అంతవరకు 'నిజం' అనుకున్న సిద్ధాంతాల్ని మార్చుకోవలసి వస్తూయుంటుంది" అని సమజాయిషీ చెప్పినట్లు చెప్పేడు రామం, ఇంకా అదే ధోరణి "అణువులూ, పరమాణువులూ అంటే నన్ను చూడమ్మా అని సిద్ధంగా నీ యెదుట బడతాయనుకున్నావా! ఎంత సూక్ష్మమైనవి, ఎంత సూక్ష్మాతి సూక్ష్మమైనవీ ననుకున్నావ్!! అలాంటి వాటిని పసిగట్టి, లెక్కగట్టి, తూనిక తేల్చి, వాటి లక్షణాలు కనుక్కోడం మాటలనుకున్నావా?" అని తిరుగు ప్రశ్నల్లోకి దిగేడిక! "ఎంత సూక్ష్మమైనవని కనుక్కొన్నారు?" అని అడిగేను రామం లెక్కల సర్దా తీర్చి అతణ్ణి సంతుష్టి పర్చడానికి. ఇక మొదలెట్టేడు. "అణువంటే కంటికే కనబడనంత చిన్నది. ఒక గ్లాసుడు నీళ్లల్లో ఎన్ని నీటి 'అణువు'లుంటాయో తెలుసా? $1.8 \times 10^{25}$ అంటే 1టి తర్వాత 25 సున్నలు చుట్టి దాన్ని 1 8 పెట్టి హెచ్చవేస్తే ఎంత సంఖ్య అవుతుందో అన్ని అణువులన్నమాట. అలా చెప్పే కంటే మరొక విధంగా చెపుతా. వీటిని ఒక లైనులో ఒకదాని ప్రక్కనే ఒకటి పేర్చుకుంటూ పోవడం మనకు సాధ్యమైందనుకుంటే భూగోళం చుట్టూ 20 కోట్ల సార్ల కంటె హెచ్చుగానే పేర్చుకుంటూ పోవలసివుంటుంది! ఇక 'పరమాణువు' పరిమాణం చెపుతా విను. ఒక అంగుళం పొడుగులో ప్రక్క ప్రక్కనే అమర్చ గలిగితే 10 కోట్ల పరమాణువులు పడతాయి, అంటే పరమాణువు అడ్డుకొలత అంగుళంలో అన్నోవంతు అన్నమాట $\left(\frac{1''}{10,00,00,000}\right)$! ఇక పరమాణువు బరువు $\frac{24\ 75}{10^{24}}$ గ్రాయిను ఇరవై నాలుగు మ్ముప్పాతికి గ్రాయినును, 1టి తర్వాత 24 సున్నలు చుట్టిన సంఖ్య చేత భాగిస్తే ఎంత వస్తుందో అంత! గ్రాయిను అంటెనే పౌనులో 7 వేల వంతు—ఆలోచించుకో! ఉదజని పరమాణువు ఒక్క ఎలెక్ట్రాను, ఒక్క ప్రోటానుతో ఏర్పడింది గనుక అన్నిటి కంటె సూక్ష్మం. అన్ని ధాతువుల్లోకీ బరువైన యురేనియం పరమాణువులో 238 ఎలెక్ట్రాన్లుంటాయి. పరమాణువు యొక్క బరువంతా కేంద్రములోనున్న ప్రోటానులో కేంద్రీకరించియుంటుంది, ఎలెక్ట్రాన్లు సుక్ష్మాతి సూక్ష్మమూ, తేలికాను—ఇవి ప్రోటాను చుట్టూ వాయువేగమనోవేగాలతో (సుమారు వెలుగు యొక్క వేగంతో సమానంగా సెకనుకి 186 వేల మైళ్ల స్పీడుతో) ప్రోటాను చుట్టూ ప్రదక్షిణలుచేస్తూయుంటాయి మన భూగోళమూ నవగ్రహాలూ సూర్యుడి చుట్టూ ప్రదక్షిణాలు చేస్తున్నటు! మన భూగోళం సూర్య గోళాల మధ్య దూరం భూమి అడ్డు కొలతకు 12 వేల రెట్లు; ప్రోటాను ఎలెక్ట్రానుల మధ్య దూరం ఎలెక్ట్రానుతో పోలిస్తే అలాగే యుంటుంది. ఆ పరమాణు ప్రపంచం (microcosm) మన బ్రహ్మాండ ప్రపంచం (Macrocosm) ఒక్కలాగే ఉన్నాయి—పరిమాణాల్లో తేడాలు తప్పిస్తేను!! పరమాణువులే సూక్షమనుకుంటే, ఎలెక్ట్రాను ఇంకా సూక్ష్మాతి సూక్ష్మం—దాంట్లో $\frac{1}{54,000}$ వంతు ఉంటుంది. అంగుళం పొడుగులో 5 మిలియన్ల-మిలియన్ల ఎలెక్ట్రాన్లు అమర్చవచ్చు; అంటే దాని అడ్డు కొలత $\frac{1''}{5,000,000,000,000}$ దాని బరువేమో $\frac{139}{10^{28}}$ గ్రాయిను. అంటే 139 ని 1టి తర్వాత 28 సున్నలు పెట్టి దానిచే భాగించాలి. అంటే 72 మిలియన్ల - మిలియన్ల - మిలియన్ల - మిలియన్లు 72,000,000,000,000,000,000,000,000 ఎలెక్ట్రాన్ల బరువు పౌనులో $\frac{1}{7000}$ వంతు! ఒక మిల్లీ మీటరు పొడవులో 200,000,000,000 ఎలెక్ట్రాన్లు ప్రక్క ప్రక్కగా పేర్చొచ్చు. ఒక ఘనపు సెంటీమీటరులో ($2\frac{1}{2}$ సెంటీమీటర్లు = 1 అంగుళం) ఎన్ని ఎలెక్ట్రాన్లు పడతాయంటే 40,000 మిలియన్ల-మిలియన్ల-మిలియన్లు. అంటే వీటిని మన మద్రాసు రాష్ట్రమంతటా (9 కోట్ల ఎకరాల భూమిలోను విత్తనాలుగా సరిసమానంగా చల్లేమనుకుంటే ప్రతీ చతురపు అంగుళానికి 80,000,000 ఎలెక్ట్రాన్ల చొప్పున పడాలి! ఒక ఘనపు సెంటీమీటరులో పట్టిన ఎలెక్ట్రానుల్ని మన

రాష్ట్ర) జనాభా ఆబాలగోపాలానికి సర్ది, రాత్రిం బగళ్లు 24 గంటలూ చింత పిక్కల్లాగ లెక్క పెట్టండంటే ప్రతీ వారూ తన వాటా 30 లక్షల సంవత్సరాలు లెక్క పెడితే గాని తేలవు!! ఎలెక్ట్రాను—$\left(\frac{1''}{5,000,000,000,000}\right)$ అంగుళం ఎక్కడ, విశ్వం చుట్టు కొలత 3 మిలియన్ల-మిలియన్ల-మిలియన్ల మైళ్లు (=3,000,000,000,000,000,000 $\times 1760 \times 3 \times 12$) అంగుళాలు ఎక్కడ! ఇలాగున్నాయి శాస్త్రజ్ఞులకు తెలిసిన దూరాతి దూరం సూక్ష్మాతి సూక్ష్మం ఐన లెక్కలు—That is the long & short of it" అని ముగించేడు రామం దీర్ఘ నిశ్వాసంతోటి. నాకు ఆశ్చర్య విభ్రమాలు కలిగేయాలేదా అని చూస్తున్నాడు. "ఔను గాని మరీ—ఆ ఎలెక్ట్రాను, ప్రోటాన్లు ఏమిటో కనుక్కోలేక పోయేరా—శాస్త్రజ్ఞులు?" అని అడిగేను. "కనుక్కోకేమి ఇవి రెండూకూడా రెండు రకాల (negative and positive) విద్యుతావేశాలని కనుక్కున్నారు, గాని ఒక తమాషా జరిగింది. ఇవి ద్రవ్యమా (Matter) అంటే ద్రవ్యమూగాదు, శక్తి (Energy) యా అంటే శక్తీగాదు, ఔనూ-కాదూ-కూడాను! అంటే ఒకప్పుడు ద్రవ్యగుణాలు, ఒకప్పుడు శక్తి లక్షణాలు చూపిస్తూ శాస్త్రజ్ఞుల్ని ఢిల్లపరుస్తున్నాయి!!" అన్నాడు. "అంటే ద్రవ్యమే శక్తి, శక్తే ద్రవ్యము అన్నకాడికి వచ్చేరన్న మాటేనా?" అని ప్రశ్నించే. "ఔనన్న మాటే మరి" అన్నాడు రామం.

ఐతే యింక విను. పదార్థాలన్నీ రకరకాల ధాతువులన్నావు, వాటి వాటి అణువులు పరమాణువులు ఉన్నాయన్నావు. అన్ని పరమాణువులూ ఎలెక్ట్రాను ప్రోటానులనే విద్యుదావేశాలవల్లనే యేర్పడ్డాయన్నావు నీవు చెప్పిన బ్రహ్మాండం లెక్కలూ విన్నాను, పరమాణు ప్రపంచం లెక్కలూ విన్నాను, పరమాణు ప్రపంచం బ్రహ్మాండ ప్రపంచం ఒక్కరీతినే ఉండడంగాదు ఒకే ఒక దానివల్ల యేర్పడ్డవేను. దీన్నే ఉపనిషత్తులు "అణోరణీయాన్ మహతో మహీయాన్, ఆత్మాస్యజంతోర్నిహితో గుహాయాన్ (అణువుకంటెను సూక్ష్మమై, మహత్తుకంటెను హెచ్చై సర్వమందూ ఆత్మ నిహితమైయుంది)' అంటూ ఎప్పుడో శతాబ్దాల క్రితమే వర్ణించేయి—ఆధ్యాత్మిక దృష్టితో తమ్ము తామే శోధించుకున్న పెద్దలు చెప్పిందీ, వాతిక దృష్టితో బాహ్యప్రపంచాన్ని శోధించి యిప్పుడు శాస్త్రం కనుక్కున్నదీ ఒక్కటే ఐంది!—(Unity in Diversity) భిన్నత్వంలో ఏకత్వమే బయటుబడిందా లేదా!! వాళ్లు 'Energy' అంటే నేమి, మనం 'శక్తి' అంటే నేమి, మరొకరు 'ఆత్మ' యంటే నేమి, ఇంకొకరు 'హరి' యంటే నేమి—ఉన్నది ఒక్కటేను.

"హరిమయము విశ్వమంతయు,
హరివిశ్వమయుండు సంశయము పనిలేదా
హరిమయముగాని ద్రవ్యము
పరమాణువులేదు వంశపావన వింటే"

అని భాగవతకారుడు చెప్పింది ఒప్పు తీరవలసింటే నంటావా లేదా?" అని ప్రశ్నించే సరికి రామం "ఒప్పుకోక తప్పుతుందా!" అన్నాడు ఆశ్చర్య తన్మయత్వాలతోటి

(కె. సు.)



# నిర్మలాదేవి గ్రంథాలయము

## (ఆంధ్ర మహిళా సభ)

మా గ్రంథాలయము పేరుకి గ్రంథాలయముగా సభకు అలంకార మాత్రముగ వుండటములేదు. ఆంధ్ర మహిళలు చక్కగా ఉపయోగించుకుంటున్నారు. అక్టోబరులో 130 పుస్తకములు చదివితే గతమాసము 200 అయింది చదువరులతోపాటు దాతల సంఖ్యకూడ పెరుగుతున్నది. అడ్వకేటు గోళ్లమూడి సూర్యనారాయణగారు 80 ఇంగ్లీషు గ్రంథములు ఇచ్చారు. శ్రీ బి. వేణుగోపాలరావుగారు తమ తండ్రిగారి జ్ఞాపకార్థము 6 గ్రంథములు ఇచ్చారు. శ్రీమతి చల్ల జానకీదేవిగారు 5 నవలలు, ఎ. రుక్మిణమ్మగారు 16 పుస్తకములు ఇచ్చారు పై దాతలందరికి హృదయపూర్వక కృతజ్ఞత

అచ్యుతిని గిరిజ

లైబ్రేరియన్.

# తల్లులకు....

"శివం"

మానవుల గుణగణాదులకు, ముఖ్యంగా బాధ్యురాలు తల్లేననే విషయాన్ని ఎవ్వరూ కాదనలేరు ఈ నాటి శిశువులు భావి భారత పౌరులయి, దేశ క్షేమానికి పాటుపడే వారవగల్గే సామర్థ్యంకూడా తల్లుల పైనే ఆధారపడివుందని అంతా గుర్తించేరు కూడాను!

బిడ్డల విషయంలో శ్రద్ధ ఎక్కువగా చూపవలసిన అవసరం తల్లుల పైన ఎంతైనావుంది. కనుక కొన్ని ముఖ్యాంశాలు ఈ విషయంలో మన స్త్రీలు గుర్తించాలి

విలియంజేమ్సు అన్నట్లు "శిశువుల బాల్యావస్థలోని 'అనుభవాలు' వారి వారి భవిష్యత్ ప్రవర్తనకు కారణాలవుతాయి." దీనికి కారణం ఆనాటి అనుభవాలు శిశువుల హృదయాలపై గాఢంగా హత్తుకుపోతాయి ఆ పసి తనంలో. అంటే తర్వాత తర్వాత హత్తుకు పోవని కాదు. బాల్యంలో అనగా, ఆరేండ్లలోపల—రంగు గుడ్డ పైన ముద్రింపబడినట్టు, ఏ విషయమైనా సులభంగా యిట్టే పట్టుకుపోతుంది శిశువు సున్నిత హృదయానికీ మెదడుకీ.

మొట్టమొదటగా మన మొక ముఖ్య సూత్రాన్ని అర్థం చేసుకుంటే మానవుని మనఃప్రవృత్తి అంతా యిట్టే అర్థమయి పోతుంది.

ఆ ముఖ్య సూత్రం మరేమి కాదు "ప్రతీ వ్యక్తీ, తనకి ఏది వుపకరించినదో అదే అవలంభిస్తూ తాను అలాగే ప్రవర్తిస్తూయుంటాడికమీదట కూడాను" అనేదే ఆ సూత్రం.

'ఉపకరించడం' అనగానే శారీరకంగానే కాదు, మానసికంగా కూడాను. ఒక విధమయిన అలవాటుగాని, నమ్మికగాని, ప్రవర్తనగాని, ఆనందాన్నీ, సంతృప్తినీ కల్గించినట్లయితే 'అది' వుపకరించిన దని చెప్ప వచ్చును

ఆ విధమయిన ప్రవర్తనగాని, నమ్మికగాని నేడుకూడా వుపకరిస్తూ వుండనక్కరలేదు. అది మొదట్లో—అనగా ఒకని అలవాట్లు రూపొందుతున్న సమయంలో అది వుపకరించి వుండి తీరాలి. అతని గుణాలు, శీలం అచ్చువుతున్న వయస్సులో 'అది' వుపకరించి వుంటుంది. కనుకనే ఆ వ్యక్తి తనకు ఒకానొకప్పుడు వుపకరించిన 'అలవాటునే' ప్రవర్తననే అనుసరిస్తాడు—నేడుకూడా. తను బాల్యంలో చేసుకున్న అలవాటువల్ల, ఏర్పరచుకున్న అభిప్రాయాలవల్ల వర్తమానంలో ప్రయోజనం అగుపించక పోవచ్చు. కాని ఆ పసితనంలో కల్గిన అభిప్రాయం, అతని హృదయం మీద గాఢంగా హత్తుకుపోయి, వయస్సొచ్చినాగాని మారదు. ఎప్పుడో పసితనంలో వుపకరించిన మర్గానే అతను నేడు కూడా అనుసరిస్తాడు. ముందుకూడా అనుసరిస్తాడు. దానినే 'స్వభావం' అంటాం 'ఉపకరించిన' మార్గాన ప్రవర్తించడం అంటాం.

ఉదాహరణకు సంఘసేవ, వాత్సల్యం, విశ్వాసం, సత్యాన్వేషణాశక్తి, పెద్దల యెడ గౌరవం, కష్టపడి పనిచేయడం, నిర్మొహమాటముగా మాట్లాడటం మొదలయిన గుణాలన్నీ ఆదిలో వుపకరించి వుండొచ్చు. వాటివల్ల వక వ్యక్తికి ప్రథమంలో—అనగా ఆ రీతిగా ప్రవర్తించడం స్థిరపడి, అలవాటుగా మారిపోయే స్థితి వచ్చేవరకు, ప్రయోజనంవుండి వుండవచ్చు. క్రమంగా అవి అలవాటుగా అయి భుజాల మీద కూర్చుంటాయి. ఒదుల్చుకుందామన్నా వదలవు. క్రమంగా స్వభావ సిద్ధమయి వూరుకుంటాయి. వాటివల్ల ప్రస్తుతం అతనికి ప్రయోజనం, ఉపకారం లేక పోయినా అతను అదే మాదిరి ప్రవర్తిస్తాడు. ఒక శిశువు పై విధాన 'ఫలానా స్వభావం' గల వ్యక్తి అని పిలువబడేటంతటి వాడవుతాడు.

ఋజువర్తన, సత్యసంధత ప్రథమంలో—అనగా బాల్యంలో "వుపకరించక" పోగా, అసంతృప్తిని కల్గించినట్లయితే, ఆ వ్యక్తిలో తర్వాత తర్వాత ఋజువర్తన, సత్యసంధతలలో అభిలాష అగుపించదు. అగుపించలేదుకూడాను. ఆ గుణాలు ప్రథమంలో ప్రయోజనకారి అయి, అతనికి ఆనందాన్నిచ్చి కొంత కాలంవరకూ అట్లాగే ఆనందాన్నిస్తూ వుండినట్లు

## బిడ్డల పెంపకంలో సలహాలు

యితే క్రమంగా అవి ప్రయోజనం కాదనే అభిప్రాయం అతనిలో స్థిరపడిపోతుంది క్రమశా అవే అలవాట్లయి, స్వభావంగా మారి అతనిని అంటి పెట్టుకొని పోతాయి. ఆ శిశువే భావిపౌరుడయి సుగుణవంతుడనబడతాడు. జీవితాంతము వరకూ—వాటివల్ల తర్వాత తర్వాత ప్రయోజనం లేక పోయినా అదే మార్గాన ప్రవర్తిస్తాడు. జీవితమే తల క్రిందయిపోవచ్చు—ప్రాణహానే కలుగవచ్చు, గాని ఆ ప్రవర్తన ఆ స్వభావం అట్లాగే వుండిపోతుంది. ఇదే 'ఉపకరించిన' విధాన ప్రవర్తించడం!

ఉపాధ్యాయులు,—ముఖ్యంగా మన ఆంధ్ర మహిళలు యీ ముఖ్య సూత్రాన్ని హృదయాలలో పదిల పరచుకోవాలి. అవసరం కల్గినప్పుడు యీ సూత్రాన్ని ప్రయోగించి శిశువుల ప్రవర్తనని, శీలాన్ని శిక్షిస్తూ, రూపమిస్తూ దేశ సౌభాగ్యానికి తోడ్పతూండాలి.

"మంచి పనులకు" ఎప్పుడూ మంచి ఫలిత ముంటుందనీ, "చెడ్డ పనులకు" చెడ్డ ఫలితముంటుందనే విషయాన్ని బాలుర హృదయాల్లో ముద్రించవలసిన అవసరం తల్లులకు ఎంతగానో వున్నది. బాలురు 'మంచి' పని చేసినా, 'మంచి' మాట పలికినా వెంటనే మంచి మాటలవల్లనయినా, బహుమతీలవల్లనయినా, బాలురకు "మంచి" యొక్క ఫలితాన్ని తల్లులు వెంటనే చూపాలి. చెడు నడతను ఎన్నడూ తల్లులు గారాబంతో సహించరాదు. వెంటనే "చెడు" యొక్క ఫలితాన్ని బాలుడికి బోధపడేట్లు చేయ ప్రయత్నించాలి తల్లులు. బాలబాలికలలో మనం కోరే గుణాలు వారికి అలవాటు చేయాలంటే యింత కంటె మరో చక్కని మార్గము లేదు

శిశువు ఉయ్యాలలోవుండగనే కొన్నికొన్ని అవసరాలను కల్గివుంటాడని తల్లులందరికీ తెలుసు ముఖ్యమైనది ఆహారం. తర్వాత శారీరక సౌకర్యం తర్వాత ఆకర్షణకొరకు, ఆమోదం కొరకు ప్రాకులాట యిత్యాది

ఈ వయస్సులోనే శిశువు, తన అవసరాలను తీర్చే వారికీ— తీరే మార్గానికీ ముడివేయసాగుతాడు. ఏ విధంగా ప్రవర్తిస్తే ఏఏ అవసరాలు తీరతాయో బాగా గ్రహిస్తాడు (కాన్షస్‌గా కాక పోవచ్చు) అంటే ఏ విధంగా ప్రవర్తిస్తే తన హృదయానికి, సంతృప్తి, ఆనందాలు కల్గుతాయో తెల్సుకొన గల్గుతాడు.

అందువల్ల ఒక నాడు—ఏ 'ప్రవర్తన'వల్ల తనకి ఆనందం కల్గినదో, సంతృప్తి కల్గినదో, ముందుముందు అదే విధానాన ప్రవర్తిస్తాడు. ఇదే 'వుపకరించిన విధాన' ప్రవర్తించడము అంటే

చిన్ననాటి అనుభవాలను బట్టి శిశువుయొక్క భావి ప్రవర్తన, గుణాదులు ఏర్పడతాయి అన్నాం. అయితే వక్క చిన్న అనుభవం చాలు శిశువు పూర్తిగా మారి పోవడానికి.

ప్రధమంలో యిద్దరు శిశువుల మధ్య అట్టే వ్యత్యాసం వుండక పోవచ్చు. కాని పని తనంలోని స్వల్పవ్యత్యాసం గల అనుభవాలే వారిని చెరోమార్గాన నడిపించగలవు. నాల్గు రోడ్ల జంక్షనులో విడిపోయే పాందుల్లా యిద్దరూ వేరయి పోతారు. ముందుకు నడచిన కొద్దీ—వయస్సొచ్చిన కొద్దీ, యిద్దరూ ఎడం అయిపోతారు—గుర్తు పట్టలేనంతగా ప్రవర్తనలో మారిపోతారు.

క్రింది వుదాహరణలు 'అనుభవాల' ప్రాముఖ్యతను చాటుతూ, తల్లుల కండ్లను విప్పడానికి సాయపడక పోవు.

ఒక శిశువు ఏడుస్తూంటే, ఎక్కడో వంట యింట్లో పని చేసుకుంటూన్న తల్లి యిది విని, నానా ఖంగారుపడి పోతూ, తనని తాను తిట్టుకుంటూ పరుగెత్తు కొచ్చి శిశువును ఎత్తుకొని ఓదార్చి లాలిస్తుంది అనుకోండి.

మరో శిశువు ఏడుస్తూన్నా (ఏ అవాంతరం లేకుండానే) వక జనని తన పనేదో తను చూసుకుంటూ వుంటుంది అనుకోండి, శిశువు గుక్క పెట్టి ఏడుస్తుంది. ప్రక్కవాళ్ళంతా "యిదేం తల్లమ్మా" అని కూడా అనుకుంటారు. చేతిలోని పనిని చూసుకొని తల్లి సావకాశంగా ఉయ్యాల వద్దకు వచ్చే సరికి శిశువు ఏడ్చి ఏడ్చి అలసిపోయి వూరుకొని వుంటాడు. ఊరకనే ఏడుస్తున్నాడను కొని తిరిగి తల్లి వెళ్ళి తన పనిని తాను చూచుకుంటుంది.

మొదటి ఉదాహరణలో "ఏడ్వడం" శిశువుకు బాగా వుపకరించినది. ఏడ్చినందువల్ల తల్లి పరుగెత్తుకొనివచ్చి ఎత్తుకొని, లాలించి, అతనికి సంతృప్తిని, ఆనందాన్నీ యిచ్చింది.

కనుక ఏడవడంవల్ల అతనికి ప్రయోజనం వెంటనే అగుపించింది.

రెండవ వుదాహరణలో 'శిశువు' యొక్క ఏడ్పు శిశువుకే మాత్రం లాభకారి కాలేదు. ఏడ్చినందువల్ల సంతృప్తిలేదు. ప్రయోజనమూలేదు గొంతు మాత్రం ఎండి పోయింది. శరీరం అలసిపోయింది కూడాను కాని తల్లి వచ్చి తనను ఎత్తుకొని లాలించలే, ఓదార్చలే. కనుక యితను ఏడ్వడం నిష్ప్రయోజన మని గుర్తిస్తాడు

మొదటి శిశువుకు—ఏడ్వడంవల్ల ప్రయోకనం నెరవేరడం వల్ల అవసరమని తోచినప్పుడల్లా ఏడ్వడం సహజమవుతుంది

రెండవ శిశువుకంటె బిగ్గరగాను, స్వల్పవ్యవధిల్లోనూ ఏడ్వవొచ్చుకూడాను. ఈ వక్క స్వల్పానుభవమే వారిద్దరినీ చెరో మార్గాన నడిపిస్తుంది ఈ స్వల్పానుభవమే యిద్దరికీ వేరు వేరు గుణాల్ని ప్రసాదిస్తుంది.

రెండవ శిశువు కొంచెము ఎదుగుతాడు. తను ఏడ్చినందువల్ల తన వాళ్ళు తనకేం అవసరాలు తీర్చరని గ్రహిస్తాడు. కాని త్వరలోనే—అనుకోకుండానే, అనుభవమువల్ల నేర్చుకోగల్గుతాడు—తను తన అవసరాలను చిరునవ్వులను నవ్వి ఆటలాడి, నవ్వించి తీర్చుకోగలనని.

మొదటి శిశువు ఎదిగినా, 'ఏడ్పు' ద్వారానే తను తన అవసరాలను నెరవేర్చుకోగలనని మాత్రమే నేర్చుకుంటాడు

ఇద్దరూ పెద్దవాళ్ళవుతారు.

మొదటివాడు జీవితావసారాలను ఏడుస్తూనే, ఏడ్పుల వల్లనే తీర్చుకుంటూంటాడు ఎప్పుడూ మూల్గుతూ, ముక్కుతూ, పరొకర్ని గురించి నసుగుతూ, సానుభూతి కోసం ప్రాకులాడుతూ, అనారోగ్యంతో బాధపడుతూ, తనని తనే జాలితో మాచుకొని పరితాపపడే వ్యక్తిగా తయారవుతాడు

రెండవవాడు జీవితావసరాలను నవ్వుతూ తీర్చుకుంటూ, 'జీవితము ఎంత ఆనంద కరమయినది' అనుకుంటూంటాడు. తన చిర్నవ్వుతో యితరులను సంతోషపరచి, తను ఆనందాన్ని పొందుతూ, సదా ఆనందంతో వూగులాడే వ్యక్తయి మంచివాడనిపించుకుంటూ జీవితాన్ని సాగిస్తాడు.

మరో శిశువుకు 'వినయవిధేయతతో' వుంటూంటే అవసరాలు తీరుతాయనుకోండి. ఆమాదిరి ప్రవర్తనే వుపకరించిన దనుకోండి. అతను వాటినే అంటి పెట్టుకుంటాడు. తల్లిదండ్రులకు ఆగుణం తమ శిశువుకు అబ్బడం యిష్టము లేక పోవచ్చును కాని అవి తనకు ఉపకరించడంవల్ల ఆ శిశువు ఆ రీతిగానే అనుసరించడం మానడు ఇతనే ఎదిగేక మెత్తగావుంటూ, వినయవిధేయత లుట్టిపడేట్లు ప్రవర్తిస్తూ 'జీ హుజూరం'టూ ఆశ్రయించే వ్యక్తి అవుతాడు.

ఒక యింట్లో తలిదండ్రు లెప్పుడూ కీచులాడుకుంటూ వుంటారనుకోండి కీచులాడు కుంటూండగా బిడ్డ ఏదో అవసరమొచ్చి ముందుకు వస్తాడనుకోండి వెంటనే ఆగ్రహంలో తండ్రో, తల్లో కసరడమో, కొట్టడమోచేస్తుంది. ఈ అనుభవంతో శిశువు తర్వాత తర్వాత గ్రహిస్తాడు నోరు మూసుకుని వకమూలకు వొదిగివుండటమే వుత్తమమని తన్నులు తగలకుండా శరీరాన్ని రక్షించుకోవాలంటే, నోరు మూసుకుని తలిదండ్రుల దృష్టినుంచి దూరంగా తొలగి పోవడమే బుద్ధికి లక్ష్యం తనకి 'వుపకారి'అనీ తెల్సుకున్నాడు. క్రమశః ఎదిగిన కొద్దీ ఆప్రవర్తనే శిశువుకు అలవడిపోతుంది. మూలమూలకు నక్కడం, తన మీద యితరుల దృష్టిపడినప్పుడు సిగ్గుపడటం, ఎట్లాగో అనుభూతి పొందడం, నరాల బలహీనతవల్ల వణకడం, బెరుగ్గావుండటం, స్వభావమయి పోతాయి—పెద్దవాడయేసరికి.

మరో విషయమేమిటంటే, తలిదండ్రులు బిడ్డలను ప్రతీదానికీ తమమీదే ఆధారపడి వుండేట్లు ప్రవర్తించరాదు. నేటి సంసారాల్లో తల్లులు ఎక్కువగా పిల్లలను గారాబం చేయడం అగుపిస్తుంది.

శిశువు కంది పోతుందేమోనన్నట్లు కొందరు కాలయినా క్రింద పెట్టనీయరు బిడ్డకు కావలసిన ప్రతీ అవసరాన్నీ తనే స్వయముగా విచారిస్తూ, తనే చూస్తూ, వుంటారు కొందరు. తనే బిడ్డకు అన్నము కలిపి (స్వయంగా కలుపుకు తినే వయస్సు బిడ్డకు వచ్చేకకూడాను), తనే గుడ్డలు కట్ట బెట్టి, తనే వాడితో అన్ని ఆటలూ ఆడి, 'యిక తను లేకపోతే బిడ్డగతి ఏమా' అన్నట్లు ప్రవర్తించి, ప్రతీ విషయానికీ తల్లి పైనే ఆధారపడివుండేట్లు ప్రవర్తిస్తూంటారు కొందరు

తల్లులు. దీని వలన బిడ్డలకు స్వతంత్రముగా ఆలోచించుకోడం, స్వవిషయాలను చూచుకోడం తెలియనే తెలియదు శిశువు ఎదిగి పెద్దదయే సరికి నిస్పృహోయగా, అబలగా తయారవుతుంది. స్వతంత్రంగా ఆలోచించుకోలేదు. ఏ విషయంలోనూ ధైర్యంచేసి ముందంజ వేయలేదు ప్రతీ కార్యానికీ మిత్రులో, తల్లో, అన్నయో సలహోయిస్తూం డాలి. తన పనులు, నౌకర్లో మిత్రులో చేసి పెట్టాలి. జీవితమే మరొకరి మీద ఆధారపడి వుంటుందంటే అతిశయోక్తి కాదేమొ!

అందుచేత తెలివిగల తల్లులంతా, బిడ్డని తనకి తనే ఆలోచించుకోని, తన అవసరాలను తనే గుర్తించుకుని, తన పనులను తనే చేసుకునేట్లు, తన బట్టను తనే కట్టుకునేట్లు, తనకి ఆనందకరమైన ఆటలు తనే ఏరుకునేట్లు చూడాలి శిక్షణా యివ్వాలి దీనివల్ల శిశువులకు యుక్తవయస్సు వచ్చే సరికి, కష్టాలను ఏదుర్కోగల సాహసం, యుక్తా యుక్త విచక్షణ, ఆత్మబలం, ఆత్మ స్వాతంత్రము మొదలయినవి అలవడతాయి.

తల్లులు తమ బిడ్డలను అనవసరంగా మితిమీరి పొగడటం (పిల్లల ఎదటే)గాని, దూషించడంగాని చేయకూడదు. దీని వల్ల అనేక అనర్థాలున్నాయి.

"చూడు చూడు అబ్బాయికి ఎంత తెలివో! ఏం చక్కని మాటలో" అనీ, "మా అమ్మాయి బంగారపు బొమ్మ అమ్మా ఎంత అందంగా వుందో చూడండి. అచ్చు మేనత్త పోలికే" అనీ "అబ్బాయి అందరిలా వూరికే అస్తమానం చదవక్కరలే. వొక్కసారి చదివితే చాలు పాఠాలు యిట్టే వొచ్చేస్తాయి" అనీ వూరికే అయిన దానికీ కాని దానికీ కొందరు తల్లులు తమ బిడ్డలను పొగడేస్తూంటారు. సాధారణంగా ఆ బిడ్డ పోజులు వేస్తూ ప్రగల్బాలు కొడుతూ అమ్మలక్కల ఎదుట ఆడుతూండే వాడనుకోండి. ఆమాదిరి ప్రవర్తన అతనికి "ఉపకరించి" వుండొచ్చు కూడాను. యీ తల్లి యొక్క పొగడ్తలతో మరింత రెచ్చిపోతాడు. ఆఖరికి లోకం మెప్పుకోసం బతికే ఓ వుత్త పనికిరాని వాజమ్మలా తయారవుతాడు పెద్దయే సరికి—అతను.

కొందరు తల్లులు అస్తమానం "అల్లరి వెధవా, మట్టిబుర్రా, వెధవ మొహం" అని తమ బిడ్డలని తిసుతూనే వుంటారనుకోండి. నూటికి యిరవై వోట్లు యిటువంటి తిట్లు పిల్లల హృదయాల్లో హత్తుకు పోతాయి, బిడ్డ తాను చేసే ప్రతీ పనీ అల్లరి పనసీ తెలివిలేని పనసీ అనుకుంటూ వుంటాడు తాను వట్టి బుద్ధి హీనుడనే నిశ్చితాభిప్రాయానికి కూడా వస్తాడు పదేపదే ఆ తిట్లను వింటూండటంవల్ల పెద్దవాడయ్యేసరికి ఏ పని చేయడానికీ తగిన ధైర్యము, వుత్సాహం వుండవు నిజముగానే బుద్ధిహీనుడుగాను, సోమరిగాను తయారవుతాడు ఆఖరికి, ఇది వూహగాదు. ప్రఖ్యాత మానసిక తత్వ వేత్త 'మాక్డూగల్' మహాశయుడు పరిశోధించి వ్రాక్రుచ్చిన విషయము

అందుకని బిడ్డని ఏమీ అనక వూరుకుంటూను వుండకూడదు గారాబంచేసి పొగడనూ కూడదు. బిడ్డచేసే పనిని బట్టి అతని నడతను బట్టి వాటియొక్క మంచి చెడ్డలు నిర్ణయించబడతాయనే వూహను బిడ్డకు అందియ్యాలి చెడ్డ పనికి చెడు ఫలితమూ, మంచి పనులకు సత్ఫలమూ వుంటుందని బిడ్డలకు తెలియజెప్పాలి. యుక్తా యుక్తాలను బిడ్డలకు తెలిసేటట్లు చెయ్యాలి తర్వాత యుక్తా యుక్త విచక్షణను స్వయంగా బిడ్డే చేసేటట్లు తల్లులు శిక్షణ యివ్వాలి.

ఈ స్వల్ప విషయాలను గుర్తించి మహిళలంతా ఆదర్శ జననులయి, మహామహులను దేశానికి ప్రసాదిస్తే భరతమాత ధన్యురాలే!

---



"నన్ను కన్న తండ్రి యేడీ?" అంటే
"నేనే!" నని తల్లి కళ్లల్లోకి చూస్తున్నాడు!
ఆమె అతణ్ణి కనలేదు! అతడే ఆవిణ్ణి కన్నాడట!!

★

# మన యెరుకకురాని మణులు

శ్రీమతి గురుజు సరస్వతిగారు

"ప్రేమమయమిా జీవనము—
త్యాగమయమిా జగమూ "

వీధి గుమ్మంలో ముష్టివాడు పాటపాడుతూ 'అమ్మా! ఆకలి' అని అరచేడు. ఐదేళ్ల పిల్లాడితో ఆటలాడుతూనే, వెంటబెట్టుకుని, చేటెడు బియ్యం భిక్షకుడి వొడిలో పోసింది తల్లి ఐదేళ్లప్పుడు విన్న ఆ పాట, ఎందుకో, ఆ బాలుడి వంట్లో జీర్ణించి పోయింది. "అమ్మా, అమ్మా! ప్రేమమయమిా జీవనము-త్యాగమయమిా జగమూ" అంటూ తాను మళ్లీ ఆ పాట పాడినప్పుడల్లా తల్లి కంట్లో కన్నీళ్లు కారేవి

వాళ్ల నాన్న వ్యవసాయం చేస్తుంటే, ఇల్లు పాడి-పంటలతో, సిరిసంపదలతో తులదూగుచున్న రోజులవి.

*  *  *

మరొక ఐదేళ్లల్లో మహీతలము మారిపోయింది—క్షామ దేవత తల విరియబోసుకుని విచ్చల విడివిగా విలయతాండవం చేస్తూ అనుదినం అసంఖ్యాక ఆర్త జనుల్ని అమాంతంగా పొట్టను పెట్టుకుంటున్న రోజులవి. వర్షాలు లేక పంటలు లేవు. యుద్ధాలవల్ల దిగుమతులు లేవు. చెట్టుచేమల ఆకు అలం, బెరళ్లు, ఆఖరుకు గడ్డివేళ్లు ఉడకబెట్టుకు తినే పుణ్యదినాలుకూడా వెళ్లిపోయేయి. సౌభాగ్య నిలయమైన యీశ్వర సృష్టిలో పట్టెడుముద్ద, ముంతెడు గంజిమాట అలావుంచి, పచ్చటి ఆకు—అలంకూడా కరువైపోయేయి.

ఎండి ఒరుగైపోయిన తల్లి, ఎనిమిదేళ్ల చెల్లెలు, ఐదేండ్ల సోదరుడు, నోరెరుగని పాపాయిని పోషించే భారమంతా పదేళ్లప్రాయుడైన సనాతనుడి నెత్తినబెట్టేడు పరమాత్మ రోజంతా చుట్టుప్రక్కల పొలాలు, పల్లెలు, పట్టణాలు తిరిగి వచ్చినా పట్టెడాహారం సంపాదించుకు రాలేక పోతున్నాడు. లభించింది కొంచెమూ తల్లికిచ్చి, పిల్లల ప్రాణాలు నిలబెట్టడానికని, తానెక్కడో కొంచం తినివచ్చేనని చెప్పుకుని జీవిస్తున్నాడు సనాతనుడు. తల్లికి తెలుసు, చిట్టితండ్రి తమకోసరం అబద్ధమాడుతున్నాడని. కాని ఏం చేస్తుంది- ఎవరు దిక్కు? కల్యాణశిష్టాలైన మానవకారాలు తప్పిస్తే మానవ జీవితాలేకావని.

ఆయస్తి పంజరాన్నే యీడ్చుకుంటూ అనేకమైళ్లు తిరిగేడీ రోజునకూడా సనాతనుడు. పట్టణంలోనైనా యెక్కడా పట్టెడాహారం పెట్టే పుణ్యగాత కనిపించలేదు దృష్టి శరీరంమిాద లేదు, ఇంటిదగ్గర తనకోసం యెదురుచూస్తూయుండే తల్లీ-సోదరీ-సోదరులమిాద ఉంది ఈ పాపిష్టిదినం వట్టి చేతులతోటే వెళ్లవలసియుండా భగవంతుడా? అని విధిని తలుచుకుంటున్నాడు. ఎవరో పుణ్యాత్ములు అంతట్లో నాలుగేనాలుగు చపాతీలు విస్తట్లోవిడివి వీధిలోకి విసిరేరు. నవనిధులు లభించవాడైనా అంత ఆనందించడు! అప్యాయంగా వాటినిచుట్టి, ఒడిలోదాచి, యింక యింటివైపు తిరిగేడు సనాతనుడు

ఎన్నిమైళ్లుంది?- ఏమో-అరమైలు-మైలు-2 మైళ్లు-ఎంత నడిచేడో ఇంక అడుగు సాగడంలే ఆకలి-ఆకలి ఆకలి చిచ్చు. పోనీ-ఒక్క చెపాతీ తింటే? ఇంట్లో నలుగురికీ నాలుగూను...ఎముకల పంజరం కదలనంటూంది చెవుల్లో హోరు ప్రపంచమంతా ఉందా-మాయమైపోయిందా? కనబడ్డంలేదు. బాటప్రక్క శుష్కవృక్షం ఆహ్వానిస్తూంది- రెండు నిమిషాలు విశ్రమించమని. వీల్లేదు. అమ్మా-చెల్లీ-గంపెడాకలితో తనకోసం చూస్తుంటారు. శరీరయంత్రాన్ని యిల్లు చేర్చింది ఎలాగో మనశ్శక్తి తలుపు తట్టేడు-తెరిచేలోపల గుమ్మంలో కూలబడిపోయింది ఎముకలపోగు, ఎక్కడినుంచో పాట-ఆ చిన్నప్పటి పాట-చెవుల్లో రింగుమంటూంది రెండు నిమిషాలేగాదు-దీర్ఘ విశ్రాంతి తీసుకోమంది ఎన్నో దినాలుగా వెంటాడుతున్న మృత్యుదేవత.

తల్లీ పిల్లలూ తలుపు తెరవేరు ఒడిలో తిండి నుంచుకునే, చిట్టితండ్రి తినకుండా పొట్టకట్టుకుని, శరీరాన్ని యింటికి జేరవేసేడు. తనకోసరం-తన పిల్లలకోసరం! ఆకలిచిచ్చేగాదు, కన్నకడుపుకీ చిచ్చుపెట్టేడు పరమాత్మ!

*  *  *

ఇలాంటి త్యాగమూర్తులు, వీరాధివీరులు, ఎంతమంది మన యెరుకకురాకుండా కాలగర్భంలో కలిసిపోయేరో మనకెలా తెలుస్తుంది?

" Full many a gem of purest ray serene,
The dark unfathomed caves of ocean bear '

"రిక్కల నీసడించెడి మరీచుల దిక్కుల గ్రక్కు రత్నముల్
లెక్కకుమిారి, సంద్రములలేవో! మనుష్యులదృక్పథంబులన్
దక్కి?.. .. . . "



# కళా వుద్దేశ్యము యేమి?

శ్రీమతి డి దుర్గావతీదేవిగారు, హిందీ విద్వాన్




ఈ విషయమములో అభిప్రాయ భేదములున్నవి. వివిధ దేశముల పండితులు భిన్న భిన్న విధముల కళాపరిభాషలను ప్రకటించియుండిరి. కళకళకొరకేనని ఒకరి అభిప్రాయము. కళ ఆదర్శముకొరకని మరొకరి అభిప్రాయము. కళ వుపయోగముకొరకని ఇంకొకరి వుద్దేశ్యము. ఇట్లే విభిన్నవాదములు బయలుదేరినవి.

ప్రతివిషయమునుగురించి భేదాభిప్రాయములు, భేదరుచులు వుండుట మానవ స్వభావము అయినను విలువగల విషయమును యెక్కువమంది ఆమోదించెదరు. కనుక కళ వుపయోగముకొరకన్న వాదననే అధికమంది సమర్థించియున్నారు. దీని కనుకూలముగా కళనుగురించి ఇట్లు చెప్పవలసియుండును. "ఒక వస్తువుయందుగాని లేక విషయమందుగాని సౌందర్యోపయోగముల సమకూర్చు కౌశలమే కళయనబడును, ప్రాచీన భారతీయ కళావుద్దేశ్యమిదియేనని నా పూర్తి విశ్వాసము లలిత కళ లన్నిటియొక్క ముఖ్య ఆశయము వుపయోగ సౌందర్యములే.

ఆధునిక యుగమున కళకళకొరకేనన్న వాదన ప్రబలమై చిత్ర, సాహిత్యలోకమందు విప్లవము వ్యాపింపజేయుచున్నది. యీ సిద్ధాంతమును అనుసరించి చూచిన కళోత్కర్షకు అభ్యుదయభావ సమూహములకు యేమి సంబంధములేదు కేవలము కళాసంబంధములగు నియమముల నిర్వహించినదే వుత్తమకళ అనబడుచున్నది యీ సిద్ధాంతమునకు వ్యతిరేకముగా కళకు మర్యాదకు చాల సమీప బాంధవ్యము కలదని, రెంటిని వేరుచేసిన కళావిచ్ఛిన్నమగుననియు ప్లాటో మహాశయుని అభిమతము. వీరి అభిప్రాయానుసారము సుందరమగు కళయందు వున్నతాశయముల సమావేశపర్చుట ముఖ్యావసరము. శ్రేష్టమగు కళకొరకు కళా నియమములు ఆదర్శభావములు రెండు అపేక్షణీయమైనవేనని రస్కిన్ మహాశయుని వుద్దేశ్యము. కనుక అభ్యుదయము కళాకారులనువారు తమ కళా నిర్వాహణకొరకు సకాలోపయోగములగు భావములను సృష్టించవలెను. వాటిని ప్రదర్శించునపుడు కళా నియమములను పాటించవలెను.

ఇప్పుడు యీ సిద్ధాంతముల నన్నిటినిబట్టి చూచిన శ్రేష్ట కళకొరకు రూపసౌందర్యము భావసౌందర్యము రెండును సమాదరము కలవనియే రుజువైనది. చూడుడు! ఒక చతుర చిత్రకారుడు ఒకానొక సర్వాంగ సుందరిని చిత్రించి మర్యాదకు బదులు ఆమె ముఖభావములందు అశ్లీలత ప్రదర్శించిన, ఆ చిత్రము సర్వజనాదరము పొందజాలదేమో? జనసమ్మతము కాని విషయమైనను వస్తువైనను స్థిరముగా వుండజాలదు, పాలపొంగువలె వెంటనే తగ్గిపోవును అటులనే రూప సౌందర్యరహితమగు వస్తువుకూడా మానవుని ఆకర్షింపలేదు భావ సౌందర్యములో యెక్కువ శక్తిసామర్థ్యమున్నను ప్రథమమున ఆకర్షించునది మనలో సంచలనము కల్గించునది బాహ్య సౌందర్యమే మానవులు సహజముగా సౌందర్యోపాసకులగు ప్రాణులగుటచే ప్రపంచములోని ప్రతి వస్తువునందు సుందరత్వమునే చూడగోరదరు కావున గుణ సౌందర్యములు రెండు సమన్వయమైనప్పుడే బంగారునకు దావల నబ్బినట్లుండును.

కాని ఆధునిక కళా కోవిదులు కొందరు యథార్థస్థితిని చిత్రించుటయే కళా వుద్దేశ్యముగాని ఆదర్శ సందేశములతో కళకెట్టి సంబంధములేదని వాదించెదరు కాని విశాలబుద్ధితో పరికించిన తమవాదన వుచితమైనదికాదని వారు గ్రహించగల్గెదరు. యెట్లన, వాస్తవమగు కళాకారుడు యథార్థ విషయమును నగ్నముగా చిత్రించజాలడు. ఒక స్త్రీ మూర్తిని గాని పురుషరూపముగాని చిత్రించిన ఆ మూర్తి శీలము కాపాడుటకై సౌందర్య నిరూపణకై వస్త్రాచ్ఛేదన సృష్టించెదరు. కాని యదార్థరూపమిదియేనని దిగంబరరూపము చూపరు. అట్లే ప్రతివిషయమునకు ప్రతికళకు వుపయోగ

## కళావుద్దేశ్యముయేమి ?

సౌందర్యముల సమకూర్చు ఆచ్ఛేదన అవసరము. కనుక నే కళాకారుడు తన విషయ-వస్తు ప్రదర్శనమందు కలా నైపుణ్యమును ఐక్యము చేయును. ప్రాకృతిక దృశ్యములందు సహజముగా కనుపించు లోపములనుకూడా కళాకారుడు తొలగించి వాటి స్థానమున గుణములను స్థాపించును. ప్రత్యక్ష విషయముల దర్శించినపుడు కళాకారుని మనమందు సంచరించు భావ తరంగముల బాహ్యారూపమే కళ అనబడుచున్నది కళాకారుని సత్యము ప్రత్యక్ష సత్యమునుండి భిన్నమగును కనుక కళాకారుని కర్తవ్యము నీరసవస్తువునుకూడా రసవంతముచేయుట కనుక యదార్థరూపమునకు కళయందు స్థానము లేదు.

ఆదర్శ-యదార్థ వాదములతో సమన్వయమగు కళాభివ్యంజనయే స్థిరముగా వుండునది భవభూతి, కాళిదాసాది మహాకవుల రచనలు నేటికిని నవ్యకళలొలుకుచూ వుండుటకు కారణమేమి ? 300 సంవత్సరములు గడచినను నేటికి షేక్సిపియర్ మహాశయుని కవితలు అంత అభిరుచితో చదువుటకు కారణమేమి ? అట్టి మహాకవుల రచనలు ప్రపంచ జిహ్వాలయందు నాట్యముచేయుటకు హేతువేమి ? కావ్య సౌందర్య భావ సౌందర్యముల సమన్వయమే వీటికి కారణము. ఇవియే ఆ కావ్యములకు అమరత్వము ప్రసాదించినవి. యే కళయందైనను సత్యం, శివం సుందరం అనగా ఆదర్శ యదార్థ సౌందర్యములు వున్నపుడే అది స్థాయిత్వమున కర్హమగును కాన, కళకొరకే కళ అను సిద్ధాంతము దోషపూర్ణమైనదని మనము నిశ్చయముగా చెప్పవచ్చు. అయితే యదార్థమునుండి దూరమగు శుష్క ఆదర్శాన్నే సమర్థిస్తున్నామని దీని ఆశయముకాదు భావసౌందర్యము రూపసౌందర్యములతో మిళితమగు కళయే సర్వాంగ పరిపూర్ణమగునది అని నా విశ్వాసము. అట్టి కళయే సర్వ దేశీయులకు అనుకరణయోగ్యమై సర్వ కాలోచితమైయుండును. బాహ్య సౌందర్యము కొంత లోపించినను భావసౌందర్యము లోపించరాదు. భావసౌందర్యోత్కర్షయే మానవ మాత్రులకు వుపయోగకరమైనగా, అభ్యుదయమార్గము చూపునది. కనుక ఆ వేళసౌందర్య సమన్వితమగు శ్రేష్ఠ అభివ్యంజనయే కళయొక్క ముఖ్యోద్దేశము.

---

"కళాకారుని సత్యము ప్రత్యక్ష సత్యమునుండి భిన్నమగును కనుక యదార్థరూపమునకు కళయందు స్థానములేదు" అన్న ఈ రచయిత్రి మాటలకును "ఏ కళయందైనను సత్యం, శివం, సుందరము . లున్నపుడే అది స్థాయిత్వమున కర్హమగును" అన్న వాక్యమునకు పొందు కుదురుటలేదు.

పోతనవంటి మహనీయుడు కవిత్వకళను కేవలము ఆత్మానందమునకేకాని "నే బలికిన బవహరమగునట" అని దెల్పుకొని దాని నైహికఫలసాధన కుపకరించక గొప్ప ఆదర్శమును నెలకొల్పెను. ఇంకను, విషయ పరిశీలనకై కళావుద్దేశమునుగూర్చిన చర్చలు ఆహ్వానిస్తున్నాము.

—సంపాదకురాలు.







# గ్రామీణులకు వైద్య సహాయం

## చర్చలో పాల్గొన్నవారు

ఆనరబుల్ ఆరోగ్యశాఖ మంత్రిణి రుక్మిణీలక్ష్మీపతి, డా॥ కాంతామణి, డా॥ సావిత్రిరాజన్ గార్లు

(లిజనర్ నుండి)

డా॥ సా —హిందూదేశం గ్రామమయం—వాస్తవానికి జనభాలో నూటికి 90 మందికిపైగా గ్రామప్రాంతాల్లోనే నివశిస్తున్నారు. బస్తీల్లో కంటె గ్రామాల్లో జీవితం అనేక విధాల ఆరోగ్యకరమంటారు, గాని మన జాతీయారోగ్యం అతిశయంగా క్షీణించి పోతుందన్న సంగతి అందరికీ తెలిసిందే. అందుచేత ప్రభుత్వంవారు, ప్రజల అవసరాల్ని తీర్చడంలో (వైద్య సహాయం—ఆరోగ్య సౌకర్యాలు సమకూర్చడంలో) గ్రామీణుల ఆరోగ్యాల్ని గురించి, తమ శ్రద్ధనంతా కేంద్రీకరింప జేయవలసియుంది. బస్తీలు, పెద్ద పట్టణాల్లో ఆస్పత్రులు, డిస్పెన్సరీలు హెచ్చుగా నేయున్నాయి గాని అలాంటి సౌకర్యాలేమీ గ్రామప్రాంతాల్లో కానరాకపోవడం వింతగాయుంటుంది. మన అసంఖ్యాక గ్రామాలకు చిరు పల్లెలకు తగినంత వైద్య సహాయం అందజేసి, అజ్ఞానంవల్లా వైద్యసౌకర్యాల లోపం వల్లా, అసంఖ్యాక రుగ్మతలకు లోనయ్యే మన ప్రజల్ని సంరక్షించడానికి ఇదివరకే మన శ్రద్ధనంతా వినియోగించవలసియుందని, యిప్పటికే చాల అశ్రద్ధ చేసేమని నేనను కుంటున్నాను. రుక్మిణమ్మగారు ఈ నా అభిప్రాయంతో ఏకీభవిస్తారా ?

రు ల. —తప్పకుండాను. ఇంత ప్రాముఖ్యమైన విషయాన్ని గూర్చి బేధాభిప్రాయాలు ఉండడానికి అవకాశమే లేదు. ఎంత వ్యయ—ప్రయాసలకోర్చియైనా సరే—మన గ్రామాలు తాము కోల్పోయిన ఆరోగ్య సౌభాగ్యాలు తిరిగి పొందేటట్లు చేయవలసియుంది. అంతేగాదు, ప్రతీ గ్రామాన్ని ఆరోగ్య శిబిరంగా మార్చివేయడం మన 'విధి' యైయుంది ; అందువల్ల యిప్పట్లాగ ప్రజలు పట్టణాలకు జేరుకోవడం తగ్గి, శుచి శుభ్రాలతో చక్కగా నిర్మింపబడ్డ గ్రామ నివాసాల్లోనే హాయిగా నుండడం జరుగుతుంది. వివిధ శాఖలవారు తమ పూర్తి సహకారాన్నిచ్చి కృషిచేసేటట్లు—ప్రజారోగ్యానికిగాని వైద్య సౌఖ్యాలకుగాని ఒక స్కీము ఆలోచించవలసియుంది. ప్రజలు, ప్రభుత్వం, వైద్య వృత్తి గైకొన్నవారు, పూర్తిగా సహకరించి ఒక జట్టుగా ఏకాశయంతో కృషిచేయవలసియుంది అప్పుడే ఇలాంటి ప్రణాళిక దిగ్విజయంగా సాగుతుంది ఈ పని విస్తారంగా వైద్యుల బాధ్యతయని నేను విశ్వసిస్తున్నాను, మీరు యేమంటారు—కాంతామణిగారు ?

డా॥ కాం —యదార్థమేగాని, నేను అనుకొనేదేమిటంటే శతాబ్దాలతరబడిగా సంక్రమిస్తున్న పిచ్చి నమ్మకాలు వగైరాలు, యీ విషయంలో అభివృద్ధికి గొప్ప అంతరాయాలుగా నున్నాయని. వైద్యులకు అందుబాటులోనున్న శాస్త్రవిజ్ఞానం—దీన్ని అంగీకరించడానికిగాని, దీనివల్ల లబ్ధిపొందడానికిదాని సుముఖుగాలేని ప్రజల్లోనూ, అలాంటి వాతావరణంలోనూ—వ్యాపింప జేయడం చాల చిక్కు. లోతుగా వేళ్లు పాతుకుపోయిన పిచ్చి నమ్మకాలు, తంతులు, అలవాట్లు, అజ్ఞానం—ఇంకా తరుచుగా మొండిపట్లు వగైరాల్ని అన్నిటినీ—మంచి చాకచక్యంవల్లా, ఓపికవల్లా బాపవలసియుంది.

డా॥ సా —డా॥ కాంతామణిగారు శాస్త్రవిజ్ఞాన విస్తరణగురించి మాట్లాడుతున్నారు. ఇది ఎలాసాధ్యమౌతుందని నేను అడగవచ్చునా ? గ్రామల్లోనున్న అసంఖ్యాక ప్రజానీకాన్నీ, వారి కందుబాటులోనున్న అతి స్వల్ప సంఖ్యాకులైన వైద్యుల్నీ గమనిస్తే—మీరు ప్లాను వేసినట్టు శాస్త్రజ్ఞానాన్ని విస్తరింపజేయడం ఎంతమాత్రం తేలికైన పనిగాదు. ఇందుకు వైద్య వృత్తిగల స్త్రీ పురుషులు గ్రామాల్లో స్థిరనివాస మేర్పరచుకుని అక్కడి ప్రజలకు

# గ్రామీణులకు వైద్య సహాయం

సేవలు గావించేటట్లు ప్రభుత్వం నిర్బంధగానైనా సరే యేర్పాట్లుగావించాలి.

రు ల —ప్రభుత్వ "కాన్‌స్క్రిప్షన్" అన్నమాట నాకు నచ్చింది. అవును, నిజమే ఇలాంటి వారి సంఖ్య మనం హెచ్చించగలిగి ఉండాలి.

డా॥ కాం —రోగాలు రాకుండా ఆపడానికి అవసరమైన విజ్ఞానాన్ని అందించడానికి వైద్యులే కావలసియుంది అని నేననుకోను రోగాలు రాకుండా ఆపడానికి ఆధునిక నిరోధక మార్గాలూ మందులూ వగైరాల్ని గూర్చీ, తమ పరిసరాలు శుభ్రంగా నుంచుకోవడంలో నుండే లాభాల్ని గురించీ సంఘాభివృద్ధికై కృషిచేసేవారు గ్రామాల్లో వ్యక్తి, వ్యక్తికీ చెప్పగల్గి గ్రామ పరిసరాలకు వైద్య సౌకర్యాలు హెచ్చించే ఏ ప్లానులోనైనా సంఘాభివృద్ధికి పాటుపడే వార్ని, ఆరోగ్యశాఖ వార్ని గూడా చేర్చాలి. గ్రామ ప్రజలకు తగినంత చికిత్సా సౌకర్యాలు కల్పించడమే గాక, రోగాలురాకుండా ఆపే మార్గాల్ని గురించి కూడా వీరు చెప్పవలసియుంది. ఐతే ఇలాంటి స్కీము వేయడానికి, నడిపించడానికి ప్రభుత్వోద్యోగేతరులకోసరం చూడలేము. గ్రామాల్లో రుగ్మతలు తగ్గించడానికి వలసిన పద్ధతుల్ని గురించి చక్కటి స్కీము తయారుచేసి నడిపించడం ప్రభుత్వం వారి విధియైయుందని ధాటీగా చెప్పవలసియుంది.

రు ల. —ఉన్నమాట దాచకుండా చెప్పివేయాలంటే ప్రస్తుత ప్రభుత్వ బడ్జెట్‌లో, గ్రామప్రాంతాలకు వైద్య సౌకర్యార్థమై ఆట్టే డబ్బు ప్రత్యేకించడానికి వీల్లేదని నేను భయపడుతున్నాను, ఐనా యీ సంవత్సరం 200 మంది మంత్రసానుల్ని తర్ఫీదు జేయడానికి ఆలోజించి బడ్జెట్‌లో యేర్పాట్లు జరిగేయి.

డా॥ సా —25 జిల్లాలున్న రాష్ట్రానికంతటికీ—5 కోట్ల 25 లక్షల పైచిలుకు జనాభాకంతటికీ—రెండు-వం-ద-ల మంది మంత్రసాను లేమూలకు సరిపోతారు!—సముద్రంలో కాకి రెట్టలాగుంది!!

రు ల. —సావిత్రిగారి తిరస్కారణ నేను గ్రహించేను. యుద్ధానంతర ప్రణాళికల ఉద్దేశం ఏమిటంటే—స్వయంసమృద్ధి, స్వయంపోషకం ఐన వైద్య సౌకర్యాలు ఆరోగ్య సౌకర్యాలుగల ప్రయిమరీ యూనిట్ల నేర్పాటు జేయడం. ప్రయిమరీ యూనిట్ ప్రతీదాంట్లోను యిద్దరు మంత్రసానులు, ఒక హెల్తు యిన్‌స్పెక్టరు, ఒక హెల్తు విజిటరు యుండి 15 వేల ప్రజల అవసరాలు తీరుస్తుంటారు.

ప్రారంభంలో 200 మందికి మంత్రసాని శిక్షణ నిచ్చి గ్రామప్రాంతాలకు పంపించి గ్రామల్లో వైద్య సౌకర్యాలకు తోడ్పడ్డానికై ఆలోచనలు జరిగేయి. యుద్ధానంతర ప్రణాళికల్లో 100 ప్రయిమరీ యూనిట్ల నియామకానికి యేర్పాటు చేస్తున్నాం.

డా॥ సా —(మీ మాటలకు అడ్డంవచ్చినందుకు క్షమించండి; ఈ హెల్తు విజిటర్లు యథార్థంగా జేసే పనేమిటని అడుగుతున్నా?

డా॥ కాం —వైద్య సౌకర్యాలు గల్పించడానికి జరిగే ఏ స్కీములోనైనా హెల్తు విజిటర్ పని చాల ప్రాముఖ్యమైంది. ప్రస్తుతం హెల్తు విజిటర్లు ఇంటింటికీ వెళ్లి, ప్రసవించబోయే స్త్రీలకు, ప్రసవానికిముందుగాను, ప్రసవించన వెనుకనూ అవలంభించవలసిన విధానాల్ని గురించి సలహాలిస్తారు. గర్భిణీ స్త్రీలు తీసుకోవలసిన ఆహారాన్ని గురించి, వారి జీవిత విధానాభివృద్ధికై తామూ తమ కుటుంబీకులూ అవలంభించవలసిన శుచి శుభ్రాల్ని శిశుపోషణను గురించికూడా సలహాలిస్తారు. ఇంకా వారు పిల్లల్ని గురించి ఎలా శ్రద్ధ తీసుకోవాలో నన్నవిషయాలు చెప్తారు. ఐనా ఇంకా అనేక విషయాల్ని గురించి సలహాలివ్వ తగ్గ సామర్థ్యానికై హెల్తు విజిటర్‌కు విజ్ఞానం కలిగించవలసియుంది. 200 మంది మంత్రసానులకు శిక్షణనివ్వడానికి ఆలోచనలు జరిగితే, హెల్తు విజిటర్లకై (ప్రత్యేకంగా యెంచబడ్డ స్త్రీ పురుషుల్ని) వేల కొద్దీ సుశిక్షితుల్ని జేయవలసియుంది. ఈ నిర్మాణ కార్యక్రమానికి అస్తిపంజరం యీ హెల్తు విజిటరైయుండాలి. సామర్థ్యవంతురాలై, సానుభూతిగల హెల్తు విజిటర్ గ్రామస్తుల ఆదరాభిమా

నాల్నీ విశ్వాసాన్నీ చులాగ్గా సంపాదించగలదు. గ్రామ ప్రాంతాలకు కల్పించబోయే వైద్య సౌకర్య ప్రణాళిక చక్కగా విజయవంతంగా పని చేయాలంటే—తగినంత ప్రసూతి సౌకర్యాల్ని గల్పించడమేగాక, అతి శోచనీయంగా నున్న మాతా శిశువుల మరణ సంఖ్యను తగ్గించడానికీ, ప్రసవించిన స్త్రీలు జీవచ్ఛవాలుగాకుండా ఆపడానికీ, క్షయ—కుష్టు—సుఖవ్యాధులు వగైరాలు తగ్గించడానికి నిరంతరం ప్రచారంగావించడం, ఇంటింటికీ వెళ్లి నూరిపోసి విజ్ఞానవంతుల్ని గావించడం, మ్యాజిక్ లాంతరు లెక్చర్లు, టాకీలు, రేడియో కార్యక్రమాలు మొదలైన సాధనలన్నీ ఉపయోగించడం జరగాలి. సుఖరోగాల్ని, కుష్టురోగాల్ని పూర్తిగా నిర్మూలనం చేసేయాలి పిల్లల్ని పాలు మాన్పించే మంచి పద్ధతులు మొదలైన వన్నీ నేర్పాలి.

డా॥ సా —హెల్తు ఇన్‌స్పెక్టర్ల పనేమిటి?

డా॥ కొం —ప్రస్తుతం గ్రామారోగ్యం, గ్రామ పరిశుభ్రత వీరి పనులు. ఐనా వీరి సేవ యింకా హెచ్చించ వలసియుంది. స్త్రీలకు చికిత్సాలయాలను, హెల్తు విజిటర్లను ఏర్పరచినట్లే యువకులకు పెద్దలకు ఆరోగ్యాన్ని గురించి సలహాలు యివ్వడానికి చికిత్సలు చేయడానికి క్లినిక్కులు స్థాపించవలసియుంది. పాశ్చాత్త దేశాల్లో తండ్రులకు, తండ్రులు కాబోయే వారికి క్లినుక్కులున్నాయి—వీటి ఫలితాలు అమోఘంగానున్నాయి. అలాంటి క్లినుక్కులు మన రాష్ట్రంలో ప్రారంభించవలసియుంది

రు ల —ఇది, ఉత్తమోత్తమమైన సలహా అని నేను భావిస్తున్నాను.

డా॥ సా —సుఖరోగాల వ్యాప్తి నరికట్టడానికి క్లినిక్కులు గొప్పగా తోడ్పడతా యని నే నెరుగుదును. ఇలాంటి యేర్పాట్లు మన దేశానికి గొప్ప వరప్రసాదంగా యుంటాయి. సుఖరోగాలమీద దాడి సాగించి వాటి నిర్మూలనానికి కృషి చేయవలసియుంది.

డా॥ కొం —క్షయరోగానికి, సుఖరోగాలకు తగిన చికిత్స నివ్వడానికి ప్రతీ గ్రామానికి తగిన సామగ్రి సిబ్బం దితో ఇలాంటి క్లినుక్కు ఉండాలి. మామూలు పురుష వైద్యుడు, కొద్దిమంది మంత్ర సానుల సహాయంతో ఇలాంటి క్లినిక్కును చులాగ్గా నడిపించగలడు.

డా॥ సా —గ్రామాల్లో కుష్టు గాలు అంతటా ఉన్న వే; కుష్టురోగ నిర్మూలనానికి రోగుల్ని ప్రత్యేకంగా ఉంచడం ఒక్కటే మనకున్న సాధనోపాయం. ఇది గ్రామాల్లో సాంఘికంగా సాధ్యం కాదనుకుంటా; ఇందుకు శాసనసహాయం అవసరమని నేను భావిస్తున్నాను.

రు ల —శాసన చట్టమా? ఏ విధంగా నంటారు?

డా॥ సా —ఈ రోగం చాల శోచనీయంగా అంటు కోవడం జరుగుతుంది. ఈ దారుణ రోగాన్నుంచి భావి పౌరులు కాబోయే యువతీయువకులు పిల్లలు సంరక్షింప బడాలని మన మంతా ఆశిస్తాం గనుక అవసరమైతే క్రొత్త శాసన చట్టాలు చేసి, గ్రామాల్లో యీ పాడు రోగం యథేచ్ఛగా వ్యాపించకుండా చేయవలసియుంది. అంటు రోగులు, ప్రజాబాహుళ్యానికి ఉపయోగించే స్థలాలు రవాణా సౌకర్యాలు ఉపయోగించడంలో నిబంధనలు పట్ట ణాల్లోనున్నా యని నే నెరుగుదును. ఇలాంటి నిబంధనలే ఏదోమాదిరిగా గ్రామ ప్రాంతాల్లోకూడా ప్రవేశ పెట్టడం అత్యవసరమైయుంది. ఈ సమస్య ప్రభుత్వంవారు ఆలో చించి తీర్చవలసినదైయుంది.

రు ల —ఈ విషయంలో జయప్రదమైన, తగు మాత్రమైన, సౌకర్యాలు కల్పింపబడలేదని నేను ఒప్పుకో వలసియుంది. చాల ప్రాంతాల్లో ప్రభుత్వంవారే కుష్టురోగ చికిత్సాలయాలు తప్పకుండా పెట్టవలసియుంది. ఉన్న ప్రయివేటు సంస్థలకు విరాళాలివ్వవలసికూడా యుంది. భోర్ కమిటీవారు యీ విషయమై అమూల్యమైన సలహా లిచ్చేరు, వీటిని సకాలంలో అమల్లో పెట్టడానికి ఆశి స్తున్నాం

డా॥ సా —ఈ సమస్య ప్రాముఖ్యాన్ని గమనించే, గాంధిమహాత్ముడు 'కుష్టు రోగ నివారణ' తన నిర్మాణ కార్యక్రమంలో జేర్చేడు. మనం నిరంతర ప్రచారం

గావించాలని, కుష్టు రోగుల్ని ప్రత్యేకించడం ఎక్కువ సానుభూతితో సాధించాలని ఆయన ఉద్దేశం నిజానికి గాంధిగారికి, కుష్టు రోగుల్ని ఇతర రోగులకంటె వేరుగా చూడ్డం యిష్టంలేదు. సంఘశ్రేయస్సుకై కృషి చేసేవారు తాముగావించే ప్రతీవిషయంలోను గొప్ప సానుభూతితో ప్రవర్తించేటట్లు తర్ఫీదు చేయాలి. కుష్టు రోగుల్ని వేరుగా యుంచడం, వారికి చికిత్స, సహాయాలు, కల్పించడం విషయంలోకూడా యిలాంటి భావాలతోనే ప్రవర్తించాలి.

డా॥ కాం —ఆరోగ్యశాఖ మంత్రిణిగారు యుద్ధానంతర పునర్నిర్మాణ కార్యకలాపాన్ని గురించీ, గ్రామ పరిశుభ్రత వైద్య సౌకర్యాలు విరివిగా వ్యాపించజేయడాన్ని గురించీ గావించబోయే యేర్పాట్ల మాట సూచించేరు ఈ యేర్పాట్లు దేన్ని సాధించడానికని గావిస్తున్నారో మరి కొంత స్పష్టంగా మాకు తెలియ జెప్పడానికి వీలుందా అని అడుగుతున్నాను ?

ర ల —తగినంత మంది సుశిక్షితులైన వార్ని నియమించడానికి ఆలోచనలు జరుగుతున్నాయి ; ఇందుకై ప్రారంభంలో రెండు క్రొత్త మెడికల్ కాలేజీలు ప్రారంభించేం. ఉన్న సంస్థల్లో, జేర్చుకునే విద్యార్థుల సంఖ్యను హెచ్చించడానికిగూడ ఆలోచిస్తున్నాం. అన్ని స్కీములకూ అనుగుణ్యమైన తగినంత మంది ఉండడానికని వైద్య శిక్షణకు, ఆరోగ్యశిక్షణకు మన దేశంలోను విదేశాల్లోను అధిక సంఖ్యాకుల్ని పంపించడానికికూడా ప్లానులు వేసేం. ఆరోగ్య పరిస్థితులు బాగుపరచి సేనిటేషన్ అభివృద్ధి పర్చడమే ప్రబల అవసరమైయుంది.

డా॥ సా —మీరు చెప్పింది వాస్తవం. అనేక రోగాలు నీటి ద్వారా వ్యాపిస్తున్నాయన్న విషయం గమనించి గ్రామారోగ్య పరిస్థితులు బాగుపడాలంటే గ్రామాలకు మంచి నీటి సౌకర్యాలు కల్పించాలని, నీటి వనర్లు, కల్మషంగాకుండా చూడాలని గుర్తించవలసియుంది.

ర ల —నిజమే. యుద్ధానంతర పునర్నిర్మాణ ప్రణాళికల్లో ఈ విషయానికి చాల ప్రాముఖ్యతయిచ్చేం. అవసరమైన గ్రామాల కన్నిటికీ మంచి నీటి సౌకర్యాలు కల్పించడం, మురుగు పోడానికి యేర్పాట్లు, నీటి వనర్లు కల్మషంగాకుండా జూచే యేర్పాట్లు విషయమై కృషి జరుగుతుంది. ఈ వెనుక రెండు తరగతుల యేర్పాట్లు 10 వేలు, అంతకు పైచిలుకు జనాభాయున్న మునిసిపాలిటీల్లో గూడ జరుగుతాయని నేనీ సందర్భంలో చెపవచ్చు. నీటి సప్లయి, డ్రెయినేజి విషయాల్లో రాష్ట్రావసరాల జాబితా తయారు చేయ బడింది, ఆయా మునిసిపాలిటీల కిచ్చిన ముందు వెనుక స్థానాల్ని బట్టి పనులు జరుగుతాయి. బహుశా వీటన్నిటి కంటె ముఖ్యమైంది "గ్రామ ప్రాంతాలకు నీటి వసతులు కల్పించడానికై పోగుజేయబడ్డ ఫండ్"కు పది లక్షల రూపాయలు చేర్చేం, కొద్ది సం.రాల్లో—ప్రతీ గ్రామమూ గాకపోయినా, కొన్నేసి గ్రామాల సమూహానికైనా చక్కటి మంచి నీటి సౌకర్యాలు కల్పింపబడతాయి. రాష్ట్రంలో దాదాపు అన్ని గ్రామాలకు తగినంత మంచి నీటి సప్లయికి యేర్పాట్లు జరిగేయి.

డా॥ కాం —యీ విషయమై వినడానికి మాకెంతైనా సంతోషంగాయుంది. గ్రామ ప్రాంతాలకు డిస్పెన్సరీలు పెట్టడం యదార్థంగా కల్పించబోయే వైద్య సౌకర్యాల్ని గురించికూడా జరుగబోయే యేర్పాట్లు మాకు కొంచెం తెలియజెపుతారా ?

ర ల —యుద్ధానంతర పునర్నిర్మాణ కార్యకలాపంలో—నాలుగేళ్లలోపలే చాల గ్రామాల్లో డిస్పెన్సరీలు పెట్టడానికి యేర్పాటు జేసేం. వైద్య సౌకర్యాలు హెచ్చించాలన్న ప్రణాళిక ఆశయం యేమిటంటే—ఏ గ్రామానికైనా సరే ఐదు మైళ్ల దూరానికి మించకుండా వైద్య సౌకర్యాలు అందుబాటులో నుంచాలనే. విస్తార జనాభాయున్న ప్రాంతాల్లో దూరంతోబాటు ఆ విషయంకూడా గమనించి, 10-12 వేల ప్రజల కొక గ్రామ కేంద్రం యేర్పాటు జేయబడుతుంది. ప్రయిమరీ కేంద్రాలతో సంబంధించి, సెకండరీ కేంద్రాలుంటాయి. ఇక్కడ క్షయ, కుష్టు సుఖరోగాలు, చెవి, ముక్కు, గొంతురోగాల చికిత్సకై ఆధునిక సౌకర్యాలన్నీ ఉంటాయి. రోగనైజాల్ని తేల్చడానికి తోడ్పడే యక్సు-రే సౌకర్యాలు, లేబరేటరీలుకూడా ఉంటాయి. ఈ సెకండరీ కేంద్రాలు మళ్లీ జిల్లా హెడ్

క్వార్టర్సు ఆస్పత్రులతో సంబంధించి ఉంటాయి. వీటిని బాగా అభివృద్ధిపరచి అన్ని శాఖల్లోను స్పెషలిష్టులవల్ల చికిత్స సౌకర్యాలు లభించేటట్లు చేస్తాం.

డా॥ కాం —సెకండరీ కేంద్రాలు, ప్రయిమరీ కేంద్రాలతో సంబంధించి ఉంటాయన్నారు, నా అభిప్రాయంలో ఊరూరు తిరిగే యూనిట్లతో తాలూకా, లేక జిల్లా హెడ్ క్వార్టర్సు ఆస్పత్రికి చెందిన ఒక ప్రవీణురాలైన లేడీ డాక్టరు అప్పుడప్పుడు సంచారం చేస్తూ, కష్టమైన ప్రసవ కేసుల్ని హెడ్‌క్వార్టర్సు ఆస్పత్రులకు చేరుస్తుంటే బాగుంటుందని. అపాయకరంగానున్న కేసుల్ని కాలయాపన లేకుండా దగ్గర ఆస్పత్రికి చేర్చడానికి ఆధునిక 'బ్లడ్ ట్రాన్సుఫ్యూషన్' పరికరాలు, తగిన సిబ్బందులతో ప్రతీ తాలూకాలోను "అంబ్యులెన్సు" యూనిట్లుండాలి.

ర ల.—యదార్థానికి వాటిని కూడా పెట్ట సంకల్పించేయున్నాం. కేసుల్ని ప్రయమరీ కేంద్రాలనుంచి, సెకండరీ కేంద్రాలకు, ఇంకా అవసరమైతే జిల్లా హెడ్ క్వార్టర్సు ఆస్పత్రికి చేర్చడానికి యివి పని చేస్తాయి. ఇవిగాక, యింకా జిల్లాలకు సంచలనం గావించే మెడికల్ యూనిట్లు యేర్పరచడానికిగూడా ఆలోచిస్తున్నాం. దీనివల్ల దూరదూరాల్లోనున్న గ్రామాలకుకూడా వైద్య సౌకర్యాలు అందించడానికి వీలుంటుంది. ఏజెన్సీ ప్రాంతాల్లో ఎక్కువ (ఐటినెరరీ) డిస్పెన్సరీలు పెట్టడానికిగూడ ఆలోచించేం

డా॥ సా —గ్రామ ప్రాంతాలకు వైద్య సౌకర్యాలు కల్పించడానికై ప్రభుత్వంవారు తలపెట్టిన కార్యకలాపానికి ప్రజాసేవలో పాల్గొనే అన్ని తరహాలవారూ గొప్పగా తోడ్పడతారని నేను విశ్వసిస్తూన్నాను కావలసింది ఏమిటంటే సానుభూతితో సాగించడం. నేను యీ చర్చ ప్రారంభంలో చెప్పినట్లు గ్రామమే మన ప్రస్తుత నాగరికత పునాది, దాన్ని సౌభాగ్యవంతంగా చేయడానికి యెంత మాత్రం కృషిలోపం ఉండరాదు.

ర ల —ప్రజారోగ్యమూ, వైద్య సౌకర్యాలూ, లోని అన్ని శాఖలయొక్క అభివృద్ధి కార్య కలాపంయొక్క దిగ్విజయం ప్రజలు తమ పూర్తి సహకారాన్ని మనఃపూర్తిగా తోడ్పడే దాన్ని బట్టి యుంటుంది రాష్ట్రమంతటాగూడా ప్రజాసంస్థలూ, ప్రజా సేవకులు, ప్రజా సౌకర్యాలకై విరాళాలిచ్చే గొప్పవారు వగైరాలంతా ముందుకొచ్చి తమ తోడ్పాటు నిస్తే అభివృద్ధి అత్యవసరమైన ప్రాంతాల్లో పనులు చప్పున ప్రారంభించడానికి వీలవుతుంది.



# రవీంద్రుని సందేశము

శ్రీమతి మల్లవరపు విజయలక్ష్మిగారు

రవీంద్రుడు వంగదేశపు మహాకవి. అంతేకాక భారత జాతీయ నాయకులలో మహానాయకుడు. ఆసియా కవి సామ్రాట్టనీ, విశ్వకవీంద్రుడనీ పేరుగాంచి, లోకమంతకూ జీవిత సత్యాన్ని గురించి ఉపదేశంచేసిన తత్వవేత్త. రవీంద్రుడు తన మహత్తర సందేశాలను పూర్వ పశ్చిమ దేశాలన్నింటికీ అందజేసి, ఎనుబది సంవత్సరాలు జీవించి, కీర్తిశేషుడైనాడు. అందుకే ఆయనను "గురుదేవు"డనికూడా పిలుస్తారు.

రవీంద్రుని సందేశాలను గురించి విపులంగా చెప్పడం చాలా చదువుకున్న పెద్దలకే కష్టసాధ్యం. అందుచేత, ఆయన అక్కడక్కడ చెప్పిన కొన్ని ప్రధాన భావాలను మనం స్మరిస్తే చాలు, కృతకృత్యుల మవుతాం.

రవీంద్రుడు బోధించిన ప్రధాన విషయం, విశ్వమానవ సోదరభావం. పాశ్చాత్య దేశాలలోని తెల్లజాతులు తమ ఆయుధబలమూ, ధనబలమూ చూసుకు గర్వపడకూడదనీ చీనా, హిందూదేశంవంటి తూర్పుదేశాలు నిద్రమేల్కొని, కాలానుగుణ్యమైన విజ్ఞానం సంపాదించుకుని, పాశ్చాత్యులతో మిత్రభావమూ, సమానభావమూ పెంపొందించుకోవాలని ఆయన బోధించాడు. జాతిభేదాలు నశించి, లోకమంతా ఏకకుటుంబంగా వుండాలన్న విషయం రవీంద్రుని ప్రధాన సందేశం.

రవీంద్రునికి ప్రియమైన రెండవ విషయం,—సర్వమానవ స్వాతంత్ర్యం. హృదయంలో స్వాతంత్ర్యం అనే దీపం వెలిగించకుండా, బయటి పరిస్థితులలో మాత్రం స్వాతంత్ర్యం పొందితే లాభంలేదని ఆయన అభిప్రాయం. అట్లాంటి స్థూలమైన స్వాతంత్ర్యాన్ని,—విశాలమైన మైదానంలో కళ్ళకి గంతలు కట్టుకు తిరిగితే ఎల్లా వుంటుందో అల్లా వుంటుందని—రవీంద్రుడు వర్ణిస్తాడు. పాశ్చాత్య దేశాలలో ప్రజలకి స్వాతంత్ర్యం వున్నట్లు పైకి కనిపించినప్పటికీ, అది పైమెరుగువంటిదే అని రవీంద్రుడు అంటాడు. అక్కడ ధనవంతులయొక్క బలం హెచ్చుపెరిగి, అనేక మాయ రూపాలతో, సామాన్య ప్రజల జీవితాన్ని అణగ ద్రొక్కుతున్నదని ఆయన అభిప్రాయం. స్వాతంత్ర్యంకోసం పోరాడే హిందూదేశం, అట్టి స్థూలమైన స్వాతంత్ర్యాన్ని కోరక, ధనవంతులకీ దరిద్రులకీ సమానంగా వర్తించే నిజమైన స్వాతంత్ర్యభావాన్ని ఆదర్శంగా చేసుకోవలసిందని రవీంద్రుడు బోధించాడు. అంతేకాక, ఒకదేశాన్ని బానిసత్వంలో అణచిపెట్టినవారు నిజమైన స్వాతంత్ర్యం అనుభవించలేరని కూడా రవీంద్రుని విశ్వాసం. కాబట్టి, విశ్వమానవ సోదరభావం ఏర్పడితేనేగాని, లోకంలో సత్యమైన స్వాతంత్ర్యం స్థాపితంకాదని రవీంద్రుని సందేశం.

రవీంద్రుడు మహాకవి, కళావేత్త అందువల్ల ఆయన బోధించిన మరొక ముఖ్యాంశం సౌందర్యభావం. రవీంద్రుని దృష్టిలో, సౌందర్యం అంటే స్థూలమైన రూపసౌందర్యం మాత్రమేకాదు. వేరువేరుగా అనేక స్వరూపాలలో కనిపించే వస్తు ప్రపంచంయొక్క ఏకత్వాన్ని తెలిపేది సౌందర్యం అని రవీంద్రుడు చెప్పాడు. అట్టి సౌందర్యభావాన్ని పెంపొందించుకుంటే, మన హృదయంలో ప్రపంచమంతటిమీదా, మానవులందరిమీదా సమానమైన ప్రేమభావం వికసిస్తుందన్నాడు. ప్రేమకల్లనే దేవుడు యీ సృష్టినంతటినీ కల్పించాడనీ, కళావేత్తకూడా ప్రేమభావాన్ని ఆరాధిస్తే సుందరమైన కళాసృష్టిచేయ గలుగుతాడనీ రవీంద్రుని సందేశం. కళారంగంలో రవీంద్రుని ఆదర్శాన్ని అనుసరిస్తే, విశ్వమానవ సోదరత్వానికి కళకూడా ఒక సాధనంగా ఉపకరిస్తుంది.

ఇన్ని గొప్ప విషయాలలో మహత్తరమైన సందేశాలను ఒసగిన రవీంద్రుడు, స్త్రీ సంఘానికికూడా తన అమూల్య సందేశం అందజేశాడు. ఈ రోజులలో నవనాగరకులైన వారు స్త్రీలకు, పురుషులకు, సమానమైన స్వాతంత్ర్యం అవసరమని వేదికలమీద ఉపన్యసిస్తూ వుంటారు. వారు అసమాన స్వాతంత్ర్యం అంటే ఏమిటో స్పష్టంగా చెప్పరు. రవీంద్రుడు ఈ విషయం చాలా చక్కగా బోధచేశాడు.

# రవీంద్రుని సందేశము

స్త్రీ స్వభావం కేవలం పురుష స్వభావంతో సరిసమానమే కనక అయితే, దేవుడు స్త్రీ పురుషుడు అనే రెండు వ్యక్తిత్వాలని సృష్టి చేయడం అనవసరం అనిపించుకుంటుందని, రవీంగ్రుడు ఒకచోట పరిహాసం చేస్తాడు. పాశ్చాత్య దేశాలలో స్త్రీ జాతి నెమ్మదిగా స్త్రీత్వాన్ని కోలుపోయి, తన స్వభావానికి విరుద్ధమైన స్వాతంత్ర్యాన్ని కోరుతున్నదని రవీంగ్రుడు విమర్శిస్తాడు అట్టి అసత్యమైన స్వాతంత్ర్యం స్త్రీలోకానికి లాభదాయకం కాదని ఆయన అభిప్రాయం అయితే, స్త్రీ కేవలం, గృహం అనే ఖైదులో పడివుండి, లోకం తెలియకుండా వుండాలని కాదు రవీంద్రుని ఉద్దేశం ప్రస్తుత నాగరకతలో పురుషుడు, తాను సృష్టించిన యంత్రబలాన్ని చూసుకు గర్వించి, మానవ ప్రేమని మరచిపోతున్నాడు. అట్టి సమయంలో స్త్రీ తనకు సహజమైన మాతృప్రేమని లోకంమీద ప్రసరించి, అన్ని రంగాలలోనూ తన ప్రభావంవల్ల మార్పు తీసుకురావాలని రవీంద్రుడు బోధిస్తాడు స్త్రీ సహజమైన ప్రేమభావాన్ని పోగొట్టుకుంటే, స్త్రీలోం పురుషలోకంమీద ఉత్తమ ప్రభావం చూపలేదు. అందువల్ల, స్త్రీ స్వాతంత్ర్యం అంటే, పురుషులతో అన్నివిధాలా సరిసమానం కావాలని కోరడం కాదు! స్త్రీ "స్త్రీ"గానేవుండి, తన ప్రేమభావంవల్ల, ఒక కుటుంబంలో అందరి మధ్యా సామరస్యం చేకూర్చిన విధంగానే, లోకకుటుంబం అంతటిలోనూకూడా సామరస్యం చేకూర్చడానికి ప్రయత్నించాలి ఇది, మహాకవి రవీంద్రుడు, స్త్రీలోకానికి ప్రత్యేకంగా ఒసగిన మహత్తరమైన సందేశం!

అందుకు, మనం గురుదేవుడైన రవీంద్రునికి కృతజ్ఞతాంజలి సమర్పిద్దాం

(ఆల్ ఇండియా రేడియోవారికి కృతజ్ఞతతో)



# వత్సరాజు

శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు

(ఒక ఘట్టం)

వత్సదేశాధిపతి ఉదయనుడూ ఉజ్జయనీనగర చక్రవర్తి మహాసేనుడూ గర్భశత్రువులు. వారి మూలంగా దేశానికి శాంతి ఉండేదికాదు అప్పుడు దేశ క్షేమంకోసం మహాసేనుడు తన కుమార్తె వాసవదత్తను వత్సరాజున కిచ్చి స్నేహం చేసుకోవాలనుకున్నాడు దానికి కావలసిన ప్రయత్నాలన్నీ చేశాడు కాని లాభంలేక పోయింది

మహాసేనుడప్పుడు సేనలతో నిండిన ఓ మాయ ఏనుగును తయారు చేసి అడవిలో ఉంచాడు వేట తమకం గల వత్సరాజా ఏనుగును వేటాడడానికి వెళ్లి శత్రువులకు లొంగిపోయాడు

ఈ ఘట్టమందలి పాత్రులు

బాదరాయణుడు, మహాసేనుడు, అంగారవతి

బాద • ఆ భీరకా! ఓ భీరకా! కాశీరాజోపాధ్యాయుడు ఆర్యజైవంతి దూతగా వచ్చాడని మహాసేన మహారాజు గారు చెప్పినట్లు ప్రతీహార రక్షకునితో చెప్పు. ఈ దూతకి సామాన్య సత్కారాలు మానివేసి అతిథిగా సత్కరించారన్నట్లు చేయాలి.

ఓ సమాన స్థాయీగల రాజవంశాలనుండి కన్యాదానం చేయమంటూ దూతలు రావడం అలవాటైపోయింది. మన రాజుగారు—'వీడు తగిన వాడు, వీడు తగని వాడు' అని ఎవ్వరినీ ఇంతవరకు అనలేదు కాకపోతే—కన్యాదాన విష యానికి దైవమే కారణమా? అయితే బ్రహ్మదేవుడు ఏ వధువుకు ఏ వరుని నియమించాడో అలాగే జరిగి తీరు తుంది. అంత వరకూ మన రాజుగారు ఆ వరుని దూతను పోల్చుకోనే లేరు.

ఓ, అదిగో—అంతఃపుర పరిచారకుల సందడి జాస్తిగా ఉంది. మహారాజువారు వస్తూన్నట్లు కనిపిస్తూంది అవును. ఆయనే మహారాజు. నేనూ అక్కడికే వెడతాను.

[పరివారంతో రాజు ప్రవేశిస్తాడు]

మహా ఈ ప్రపంచంలో ఉన్న రాజులందరూ నా గుర్రపు డెక్కలలోంచి పుట్టిన ధూళిని శిరస్సులమీద ధరిస్తూ ఉన్నారు. బాగానే ఉంది కాని, గజహృదయం తెలిసిన వత్సరాజు నాకు నమస్కారం చేయక పోవడంవల్ల ఇవన్నీ వృథా అనిపిస్తున్నాయి. అంతే కాదు మనస్సుకు సంతోషం లేనేలేదు కానీ—

బాదరాయణా!

[ప్రవేశించి]

బాద: మహాసేన మహారాజుగారికీ జై. ఏమి సెలవు?

మహా జైవంతిని గౌరవించినారా?

బాద ప్రభూ! తగిన భవనమునందుంచి గౌరవించాము.

మహా మాయందు నీకలాంటి విశ్వాసమున్నది కాబట్టి మా గౌరవం దక్కిస్తున్నావు అయినా అతిథుల్ని పూజిం చడం మంచిదే కదా! లేకపోతే—కన్యా దానం చేయ మంటూ అడుగ వచ్చిన వారికి కొంచం లొంగవలసి వస్తుంది. ఆఁ ఏమో చెప్పడానికి ప్రయత్నిస్తున్నా వేమిటదీ?

బాద చెప్పడాని కేముంది బాబూ! కన్యా దానాని గురించే ఆలోచిస్తున్నాము.

మహా అవును అవును ఇది అందరికీ కావసినదే చెప్పు.

బాద ప్రభూ! ఈ విధంగా రోజూ మనకు తగిన రాజ వంశాల్లోనుండి ఎవరో ఒకరు దూతలుగా వచ్చి వెడు

తున్నారు ఏలిన వారందులో ఎవరినీ కాదనలేదు, అవు ననలేదు. కారణం ?

మహా కారణమా ? అతి గుణవంతుడైన వరుడు కావాలనీ, వాసవదత్త మీద ఉన్న వాత్సల్యంచేత ఎవర్నీ నిర్ణ యించలేకుండా ఉన్నాను ఇంకో సంగతి—వరుడు మంచి కీర్తిశాలీ, కులీనుడూ, దయామయుడూ, పరా క్రమవంతుడూ, బలవంతుడూ, శత్రు భయంకరుడూ, స్త్రీలను రక్షించే సామర్థ్యంగలవాడూ అయివుండా లని కూడా వుంది

బాద ప్రభూ, ఇలాంటి గుణసంపద మహాసేనుడు కుమారస్వామికి తప్ప ఇంకెవ్వరికి ఉన్నదీ.

మహా అందుకే ఆలోచిస్తున్నాను. తల్లి తండ్రుల ప్రయ త్నాలవల్ల కన్యకు వరుడు దొరుకుతాడు. కాని ఆమె అదృష్టంకూడా కలసిరావాలి. ఏమంటావు ? అయినా- కన్యాదాన సమయంలో తల్లి దుఃఖపడుతుంది కాబట్టి- దేవి అంగారవతిని పిలుచుకుని రా.

బాద చిత్తం. [వెళ్లును]

మహా ఓ ! కాశీరాజు దూతను పంపించినట్లుగానే వత్స రాజును పట్టుకోడానికి వెళ్లిన శాలంకాయనా మాత్యుని మీదికి బుద్ధి వెళుతూంది ఆ బ్రాహ్మణుడింత వరకూ ఏ కబురూ పంపించాడే కాదు.

[పరివారంతో దేవి ప్రవేశిస్తుంది.]

అంగారవతి మహాసేన మహారాజులకు జై.

మహా దేవీ ! అంగారవతీ ! రా కూర్చో.

అంగా చిత్తం. [కూర్చుండును]

మహా అమ్మాయి, వాసవదత్త యేది ?

అంగా ప్రభూ ! ఉత్తరవైతాళిక దగ్గర నారదీయ వీణ నేర్చుకోడానికి వెళ్లింది.

మహా ఆఁ సంగీతమా ! ఆ ఆశక్తి దానికెలా కలిగింది ?

అంగా కాంచనమాల అనే చిన్నది తన వీణకి బంగారు పూలమాల చేయించుకోవడం చూసింది. అప్పటినుంచీ దీనికి సంగీతం నేర్చుకోవాలని శ్రద్ధ పుట్టింది.

మహా నిజంగా ఇప్పుడే అది నేర్చుకోవాలి. మంచి ఊహే కలిగింది

అంగా మహారాజా ! మీకు సమస్తమూ తెలుసును. అయినా నేనో మాట అడగాలను కుంటున్నాను. అడగమన్నారా ?

మహా ఆఁ తప్పకుండా.

అంగా మన అమ్మాయికి సంగీతం నేర్పడానికి ఉపాధ్యా యుడు కావాలి చూస్తారా ?

మహా ఎందుకే వెర్రిదానా ! దాని భర్తే దానికి నేర్పు తాడు. పెండ్లీడు వచ్చిన పిల్లకి పైవాడుపాధ్యాయుడా.

అంగా ఆఁ. ఏమనుచున్నారు ? దానికిది పెండ్లి సమ యమా ?

మహా దేవీ ! నిన్న మొన్న టిదాకా దీనికి వివాహం చేయ మనే నువ్వు—ఈ వేళ దుఃఖంగా అడుగుతున్నావేమి?

అంగా లేదండీ ! దానికి వివాహం చేయడమంటే నాకూ ఇష్టమే. కాని దానిని విడిచి ఉండగలనా అని భయ పడుతున్నాను. అయితే; ఎవ్వరికిచ్చారు ?

మహా ఇంకా నిశ్చయించలేదు.

అంగా లేదా ?

మహా కన్యను ఎవరికేనా ఇవ్వక పోతే సిగ్గు. ఇస్తే దుఃఖం. ధర్మ బద్ధులైన తల్లులీ రెంటిలోనూ పడి వియోగ దుఃఖాన్ని అనుభవిస్తూ ఉంటారు. వాసవదత్త ఇప్పుడు అత్తమామల్ని సేవించే వయస్సులో ఉంది. మరో సంగతి — కాశీరాజోపాధ్యాయుడు ఆర్యవైవంతి దూతగా వచ్చి నన్ను మభ్య పెడుతున్నాడు. దేవీ ! ఏమీ చెప్పకుండానే దుఃఖ పడుతున్నావు. కార్య భారాన్ని చూచి నిర్ణయిస్తావా ? మన వాసవదత్తను చేసుకొంటామంటూ నా చుట్టాల నేకులు వస్తున్నారు.

అంగా ప్రభూ ! వస్తున్నారు. నిజమే. ఎవరికిచ్చిన మనకు సంతాపం ఉండదో వానికివ్వండి.

మ : ఓ ! ఈవేళ చులాగ్గా మాటాడుతున్నావు. ఆ తరు వాత నిందిస్తావు నీకు నచ్చిన సంబంధమే చేస్తాను చూడు—మన సంబంధం కావాలని మాగధులూ,

మైథిలులూ, శూరసేనులూ, సౌరాష్ట్రులూ, అంగదేశాధీశులూ వస్తున్నారు వీరిలో నీకెవ్వరిష్టమో——

[ప్రవేశించి]

బాద వత్సరాజు.

మహా (కోపంతో సింహాసనం మీదనుండి లేచి) వత్సరాజేమి ?

బాద ప్రభూ ! మన్నించు. మన్నించు ప్రియం చెప్పే తొందరలో మర్యాదను అతిక్రమించాను

మహా ఏమిటీ ! ఏమిటీ ! ప్రియమా ?

అంగా (లేచి) మహారాజులకు జయం.

మహా (సంతోషంతో) దేవికి ప్రియమైన మాటలంటే ఇష్టం. కూర్చో

అంగా : చిత్తం.

మహా (బాదరాయణునిచూచి) లెమ్ము లెమ్ము. ధైర్యంగా చెప్పుము.

బాద : (లేచి) శాలంకాయణమాత్యులు వత్సరాజును పట్టుకొన్నారు.

మహా (హర్షంతో) ఏమిటీ ! ఏమిటీ ! ఏ——

బాద : శాలంకాయణమాత్యులు వత్సరాజును పట్టుకున్నారు.

మహా పట్టుకొన్నాడా ?

బాద పట్టుకొన్నారు.

మహా : ఉదయనుడా ?

బాద : ఆc.

మహా శతానీకుని కుమారుడా ?

బాద అవును

మహా సహస్రానీకుని మనుమడే !

బాద ముమ్మాటికి.

మహా : కౌశాంబికి ప్రభువు !

బాద కౌశాంబికి ప్రభువు.

మహా గాంధర్వవేత్త !

బాద : ఆc.

మహా వత్సరాజే !!

బాద వత్సరాజు మహారాజా ! వత్సరాజు.

మహా అయితే ఆతని మంత్రి యౌగంధరాయణుడు మరణించినాడా ?

బాద లేదు లేదు అతడు కౌశాంబిలో ఉన్నాడు.

మహా అయితే, దొరికినవాడు వత్సరాజుకాదు

బాద అతడే, ప్రభూ !

మహా ఓరీ ! వత్సరాజును పట్టుకోవడమంటే ఏమిటనుకుంటున్నావు ! ఆ పని మందర పర్వతం చేతితో ఎత్తడం వంటిది. పైగా అతని శౌర్యాన్ని శత్రువులే స్తోత్రం చేస్తారు. ఇంకోసంగతి జ్ఞప్తియందున్నదా——యౌగంధరాయణమంత్రి యెత్తు లింతవరకూ చెవుల్లో గింగురుమంటున్నాయి

బాద అవును ప్రభూ ! వృద్ధబ్రాహ్మణుణ్ణి. మీదగ్గరెన్నడైనా అబద్ధం ఆడి ఉన్నానా ?

మహా అయితే-శాలంకాయనుడు పంపిన ప్రియదూత ఎవ్వడూ ?

బాద : ప్రభూ ! దూతరాలేదు వడిగల గుర్రాల్ని కట్టిన రథం మీద వత్సరాజును ఎక్కించుకుని అమాత్యులవారే వచ్చారు

మహా ఆc అలాగా ఇంక నా సేనలకు కవచాలక్కర లేదు. విశ్రాంతి తీసుకుంటాయి. ఇప్పటినుండీ గూఢచారుల పనులుండవు

అంగా ప్రభూ ! అమాత్యులే తీసుకుని వచ్చినారా !

మహా అవును , దేవీ !

అంగా ఈ కారణంవల్ల వాసవదత్తను ఎవ్వరికివ్వడమా అనే తలంపులేనివారమైనాము

మహా పరాజితుడైన ఆతడు నాకు గర్భశత్రువు బాదరాయణా ! శాలంకాయను డెక్కడున్నాడు ?

బాద భద్రద్వారమున

మహా రాజకుమారుల్ని గౌరవించినట్లు ఆ వత్సరాజును గౌరవించండి ఆతనితో అమాత్యునికూడా రమ్మని చెప్పు.

బాద చిత్తం (వెళ్లుచుండును).

మహా ఇదిగో—

బాద ఏమిసెలవు—

మహా వత్సరాజును చూడడానికి వచ్చినవారిని వారింప వద్దు. ఏమంటే, ఆతని శౌర్య పరాక్రమాలు జనులిది వరకు కథలుగా చెప్పుకునేవారు ఇప్పుడు ప్రత్యక్షంగా చూస్తారు.

బాద ఆజ్ఞానుసారం. (వెళ్లిపోవును)

అంగా ఈ కోటలో అనేక సౌఖ్యాలనుభవించాం అయితే ఇలాంటి ఆనందం మహాసేనులకెన్నడూ కలగలేదు.

మహా ఈ వత్సరాజును పట్టుకొన్నందువల్ల కలిగిన ఆనందం, మరి దేనివల్లా కలిగినట్టు నాకూ జ్ఞప్తియందులేదు.

అంగా ప్రభూ! నిజంగా ఆతడు వత్సరాజేనా?

మహా సందేహమెందుకూ?

అంగా మనతో సంబంధంకోరి అనేక మహారాజులు దూతల్ని పంపించారు కదా! ఇతనెందుకు పంపలేదు?

మహా ఇతడు—'మహాసేనుడు' అన్న పదాన్నే వప్పు కోడు అలాంటివాడు మన సంబంధాన్ని అపేక్షి స్తాడు?

అంగా బాలుడా? మూర్ఖుడా?

మహా బాలుడూకాడు మూర్ఖుడూకాడు.

అంగా అయితే ఎందుకీగర్వం?

మహా విను—సుప్రసిద్ధ భరతవంశం వంశమనీ, గాంధర్వ వేదం తెలుసుననీ, వయస్సుకు తగిన రూపమున్నదనీ, పౌరులు తనని గౌరవిస్తారనీ గర్వం.

అంగా ఇవి, వరునకుండవలసిన గుణాలే కాని, ఎవరి నామభావం దీనికి కారణమో తెలియడం లేదు

మహా దేవీ! అనర్ఘ్యవస్తువును మెచ్చుకొందువేలా?

[ప్రవేశించి]

బాద జయం. శాలంకాయనామాత్యులు గౌరవ పూర్వ కంగా ప్రవేశించారు. భరతకులోపభుక్తమై వత్సరాజు వంశంలో ఉన్న ఈ ఘోషవతి అనే వీణారత్నాని తమ కిమ్మని పంపినారు. (వీణను చూపిస్తాడు)

మహా. ఆహా! జయమంగళము ప్రాప్తించింది (వీణ తీసు కుని) దీని ధ్వని అతిమధురం ఆ మధురధ్వని ఏనుగుల మనస్సుల్ని బలవంతంగా ఆకర్షిస్తుంది. ఏమి చెప్పను! ఇంకా విరోధులికి ఇష్టమైనవాటిని కలిగిస్తుంది నా పెద్ద కుమారుడర్థశాస్త్రవేత్త వాడికిది అక్కరలేదు రెండో వాడికి వ్యాయామం తప్పితే మరేమీ అక్కరలేదు. అయితే దీన్ని ఎక్కడుంచను? దేవీ! వాసవదత్త వీణ నేర్చుకొనుచున్నది కదూ!

అంగా ప్రభూ! నేర్చుకొనుచున్నది

మహా అయితే, దీనిని దాని కియ్యి

అంగా ఇంక దీనిని ఎప్పుడూ విడిచి పెట్టదు. దీనితో క్రీడిస్తూ ఉంటుంది.

మహా క్రీడించనీ, క్రీడించనీ ఇది అత్తవారింటిలో సాధ్యం కాదుకదా! బాదరాయణా! అదెక్కడా?

బాద మంత్రితో.

మహా వత్సరాజు?

బాద అలసి ఉన్నాడు అతనికి శరీరమంతా గాయాలు పడ్డాయి అందువల్ల పల్లకీలో లోపలి గృహంలోనికి తీసుకు వెళ్లారు.

మహా అయ్యో! గాయాలా! ఎంత పని ఇది శిక్షలేని శౌర్యంవల్ల కలిగింది ఇప్పుడాతని విషయంలో నేను ఉపేక్షిస్తే నన్నందరూ దుర్మార్గుడంటారు బాద రాయణా! త్వరగా వాని గాయాలు పోవడానికి తగిన చికిత్స చేయమని నా మాటగా భరతరోహకునితో చెప్పు.

బాద చిత్తం (వెళ్లుచుండును).

మహా ఇదిగో—

బాద మహారాజ!

మహా: అతని కోర్కెలు గౌరవ పూర్వకంగా నెరవేర్చండి. ఆతని ముఖవైఖరిని పట్టి పనులు తీర్చాలి. యుద్ధవార్త

నేమీ అక్కడ ప్రసంగించవద్దు. ఆతను తుమ్మినా ఏమి చేసినా ఆశీర్వదించాలి. సమయానుకూలంగా పొగడాలి.

బాద: చిత్తం (వెళ్లి—వచ్చి) మహారాజ! ఆతని గాయాలకి మార్గమధ్యంలో చికిత్స చేశారట! రెండవ చికిత్సకిది వేళ కాదన్నారు. రెంసు ఝాములైంది. ఏమి సెలవు?

మహా: ఆ వీరుడెందున్నాడు.

బాద: మయూరయష్టి ముఖమునందున్నాడు.

మహా: అయ్యో! అక్కడ వద్దు. బాగా ఎండ తగిలే మణి భూమికలో ఉంచమని చెప్పు.

బాద: చిత్తం (తిరిగి వచ్చి) సమస్తమూ చేసినారు. భరత రోహకామాత్యులు తమ దర్శనార్థం ద్వారంకడ నిలిచి ఉన్నారు.

మహా: వత్సరాజును గౌరవించడం ఈతనికి ఇష్టంలేదు. రాజనీతి అలాంటిది. నేనే ఆతని విషయం తెలుసుకొంటాను.

అంగా: సంబంధం నిశ్చయమైనదా?

మహా: లేదు దేవీ!

అంగా: అమ్మాయి చిన్నది కదా!

మహా: నీ యిష్ట ప్రకారం చెయ్యి వెళ్లు.

అంగా: చిత్తం. (పరివారంతో దేవి వెళ్లును.)

మహా: ఆహా! వీడి గర్వాన్ని పూర్వం నేను సహించలేక పోయేవాణ్ణి. ఇప్పుడాతడు సంశయావస్థలో ఉన్నాడు. ఈ తీసుకు రావడంలో నా కేమీ పాలు పోవడంలేదు. ఏమి చెయ్యను?

[అందరూ వెళ్లుదురు]

(నా 'వత్సరాజు' నాటికనుండి)



మేలైనజీవితమును గడుపుటలో సహజగ్రహణశక్తిగల పారశీకులు నిత్యజీవితములో టీ అత్యావశ్యకమైన పానీయమని చాలకాలము నుండిఅవలంభించుచున్నారు. బ్రూక్ బాండ్ టీ తాజాగానుండబట్టి ప్రతియొక పారశీక గృహములోను గౌరవస్థానమును వహించియున్నది. ఈగొప్ప ఉపఖండమందలి అన్ని ప్రదేశములయందువలె ఇచటకూడ కానగును..






# బ్రూక్ బాండ్

రెండాకులు ఒక మొగ్గ

# పిల్లల నర్సరీ స్కూళ్లు

## 1 ఇంగ్లాండులో

యుద్ధాలైపోయేయి కనుక ఇంగ్లాండులో నర్సరీ స్కూళ్ల యేర్పాటుకై గొప్ప కృషి జరుగుతూయుంది. ఇవి యుద్ధానికి పూర్వం చాల కొద్దిగా యుండేవిగాని, యుద్ధకాలంలో స్త్రీల సహాయం ప్రభుత్వంవారికి అవసరమైంది కాబట్టి, వారి పిల్లల్ని (1 నెల వయస్సు వారినుంచి 5 ఏళ్ల ప్రాయం వారి నందరినీ) చూసేందుకు నర్సరీ స్కూళ్లు విరివిగా పెట్టేరు. తల్లిదండ్రులు తమ పిల్లల్ని వీటిల్లో వదిలేసి నిశ్చింతగా పనిలోకి పోవచ్చు గనుక యీ స్కూళ్లు బాగా జనసమ్మతమైపోయేయి. నర్సరీ స్కూళ్లంటే పిల్లల్ని పెంచుకుని విద్యాబుద్ధులు జెప్పుకోలేని బీదవారికని, అల్లరి పిల్లల్ని చేర్పించి శిక్షణ నిచ్చే సంస్థలని ఈ మొదలైన అపోహాలన్నీ పోయి, అందరూకూడా తమ పిల్లల శిక్షణ క్రమరీతిని జరగాలంటే వీటికే పంపించాలని విశ్వసించే పరిస్థితులేర్పడ్డాయి. యుద్ధానికి పూర్వమున్న నర్సరీ స్కూళ్లకు, యుద్ధకాలంలో వాటికి, యిప్పటి వాటికి తేడాలున్నాయి. పూర్వం పిల్లల్ని కొద్ది గంటలే చూడవలసి వచ్చేదిగాని యుద్ధకాలంలో తల్లులు పనినుంచి తిరిగి వచ్చేవఱకు చూడ్డం అవసరమైంది. ఒక్కొక్క సారి పిల్లలు రాత్రి అంతా ఉండిపోయేవారు. చాల చిన్న పిల్లల్నికూడా తీసుకునేవారు కనుక యీ సంస్థలు మినిస్టరీ ఆఫ్ హెల్తువారు నడిపించి, మాష్టర్లకు సహాయం చేయడానికి నర్సుల్ని ఉంచేవారు,

ఇంగ్లాండులో 1914 లో ఒక క్రొత్త ఎడ్యుకేషనల్ ఆక్టు అమల్లో పెట్టేరు దీనివల్ల ఆయా ప్రాంతాల విద్యాధికార్లు యుద్ధకాలంలో వలెనే ఇంకా పిల్లల శిక్షణ విధానాల్ని నడిపించడానికి, యుద్ధానంతర పరిస్థితుల కనుగుణ్యంగా వాటిని మార్చి, తల్లులు యింకా పనుల్లోకి వెళ్లడానికి వీలుండేటట్లు పగటిపూట బడులుకూడా ఉంచవలసి వచ్చింది. ఈ చట్టం ప్రకారం 2-5 సంవత్సరాల వయస్సుగల పిల్లల శి.్రు చూచే బాధ్యత విద్యాధికార్లదైయుంది. యుద్ధకాలంలోని నర్సరీ స్కూళ్లు తీసుకుని వాటిని శాంతి కాలంలో నర్సరీ స్కూళ్లగా మార్చడానికి స్థానిక సంస్థలు కూడా పూనుకున్నాయి. వీటిల్లో చిన్నపిల్లల నర్సరీక్లాసులు, పెద్దపిల్లల శిక్షణ ఉంటుంది. ఐనా 2-5 ఏళ్ల పిల్లల్ని బలవంతంగా ఏమీ చేయడానికి వీల్లేదు. అంతా తల్లిదండ్రుల అనుమతితోటే జరుగుతుంది. పిల్లల అవసరాలేమిటో కని పెట్టే అవకాశం ప్రభుత్వం వారికి బాగా కలిగింది గనుక వారు చక్కటి సలహా నివ్వగల స్థితిలో ఉంటారు.

పిల్లలకు ఐచ్ఛిక శిక్షణ చిన్న పిల్లలకు యీ ఐచ్ఛిక శిక్షణ ఏమిటా అంటారేమో. ఇంగ్లాడు ప్రజలు కుటుంబ జీవితానికి కుటుంబ వాతావరణానికి చాల ప్రాముఖ్యత యిస్తారు; అందుచేత పిల్లల్ని చులాగ్గా కుటుంబంనుంచి వేరుచేయడానికి అంగీకరించరు. ఈ ఐచ్ఛిక శిక్షణ ఆశయం ఏమిటంటే తల్లిదండ్రులకు తోడ్పడి, పిల్లల శిక్షణ నింకా చక్కటి పద్ధతిలో నడిపించేటట్లు జేయడమే. ఈ రోజుల్లో చిన్న చిన్న యిళ్లల్లో కుటుంబాలు గడపవలసి వస్తూయుంది, యుద్ధకాలంలో కంటె రాబడులు తగ్గేయి, ఒకళ్లిద్దరు పిల్లల కంటె హెచ్చుగా తమ దగ్గర నుంచుకోడానికి వీలులేకుండా యుంది. అందుచేత చాల మంది తల్లిదండ్రులు తమ పిల్లలకు తగిన శిక్షణ, అభివృద్ధి కనుగుణ్యమైన వాతావరణం కల్పించలేమని గ్రహించేరు గనుక వీరికి విద్యాధికార్లు చక్కగా తోడ్పడి సహాయం చేయడానికి తగిన పరిస్థితులేర్పడ్డాయి. ఎడ్యుకేషనల్ ఆక్టులో నర్సరీ స్కూళ్ల సెక్షను 2-5 ఏళ్ల ప్రాయంగల పిల్లలకు వర్తిస్తుంది, ఈ వయస్సు పిల్లల్ని తల్లి శిక్షణ క్రిందనే ఉంచి వేయడం ఉత్తమోత్తమమైన పద్ధతి అని అధికార్లకు తెలుసు. అదిగాక రెండేళ్ల పిల్లలు ప్రతీవారూ నర్సరీ స్కూలు ట్రెయినింగువల్ల లాభం పొందుతారనికూడా వారు అను

కోవడం లేదు. కొందరు పిల్లలు యీ వయస్సులో కుటుంబ వాతావరణాన్నుంచి వేరు చేస్తే, ఏమీ సుఖంగానుండరు. అందుకే తల్లిదండ్రులు విద్యాధికార్లు కలిసి చర్చించి పిల్లల సుఖం తల్లిదండ్రుల యిష్టాలు వగైరాల్ని బట్టే అన్నీ చేస్తారు.

పిల్లలు నర్సరీ స్కూల్లో ప్రవేశించగానే, వారికి తమ తమ గృహ వాతావరణాల్లో యుండే సౌకర్యాలన్నీ యిచ్చి ఇంకా అంత కంటె సౌఖ్య ప్రదంగాను, అభివృద్ధికి అనుగుణ్యంగాను ఉండే వాతావరణాన్ని కల్పిస్తారు. ఇక్కడ వారికి ఆడు కొందుకు వివిధ వయస్సుల్లో నున్న పిల్లలుంటారు. మసలడానికి విశాలమైన ప్రదేశముంటుంది. తగినంత వెలుగు, గాలి, వేడి, చక్కటి ఆహారం పానీయాలు, వారికి కావలసినంత విశ్రాంతి వగైరాలన్నీ యిస్తారు. నియమిత కాలాల్లో సరిగ్గా వైద్యులు పిల్లల్ని పరీక్షిస్తుంటారు. పిల్లలు తమ తమ స్వభావాల్ని బట్టి, అభిరుచుల్ని బట్టి అభివృద్ధిపొందడానికి తగిన పరిస్థితులన్నీ కల్పిస్తారు. నర్సరీ స్కూళ్లల్లో టైముఅంటే మన పెద్దల టైము గాదు. పిల్లల దృష్ట్యాయుండేటైమే గమనిస్తారు. పంతులమ్మగారు ప్రతీ అబ్బాయి, అమ్మాయిని శ్రద్ధగా కనిపెట్టిచూచి వారి వారి అభిరుచులు యిష్టాయిష్టాలు కనిపెట్టి తానొక తల్లిలాగ స్నేహితురాలిలాగ వారితో ప్రవర్తిస్తుంది. చాల మంది పిల్లలకు ఒక నిర్ణీత విధానమే బాగుంటుంది. దానివల్ల కొంత నమ్మకం, తమ్ము శ్రద్ధగా చూచేవారున్నారన్న ధైర్యంకలుగుతుంది. అందుచేత వారికి, విశ్రాంతికి నిర్ణీత కాలాలుంటాయి. గాని, పిల్లల యిష్టాలకు వారి చర్యలకు అడ్డుతగలరు. నర్సరీ స్కూళ్లల్లో యిది మామూలు దినచర్యయని, యిది శిక్షణ కార్యమని వేర్వేరు గాఉండవు. పిల్లలు చేసే ప్రతీ పనీ వారికి శిక్షణ క్రిందే లెక్క——రాగానే కోటుతీసి చిలక్కొయ్యకు వేయడం దగ్గరనుంచి, భోజనకాలంలో తనకు తాను, సహాయంచేసుకోవడం ఇతరులకు చేయడం దగ్గరనుంచి, ఇంటికి వెళ్లిపోయేముందు తనకు చేతనైనంత బాగాదుస్తులు ధరించడంవరకూ అంతా శిక్షణ క్రిందనే లెక్క. పిల్లలు తమకు సమస్యల్లాగున్న వాటినన్నిటిన్నీ పరిష్కరించడానికి ప్రయత్నిస్తూనేయుంటారు; ప్రయత్నము, పట్టుదలల యొక్క అవసరమూ సాధించడంలో నుండే ఆనందమూ నేర్చుకుంటుంటారు, తోటివారితో పోటీ చేస్తుంటారు. నర్సరీ స్కూళ్లల్లో ఇచ్చిన సావకాశాల వల్ల వేర్వేరు పిల్లలు వేర్వేరు లాభాలు పొందుతుంటారు. ఉదాహరణకు మేరీ అనే పిల్ల ఉందనుకోండి. అంగపుష్టితో అందంగాఉంది. తల్లి ఒక హోటల్లో పని చేస్తూయుండేది; ఆమెతో ఒంటరిగా ఉండేది, తల్లి ఆమెను గురించి చాల శ్రద్ధతీసుకొనేది. 3½ ఏళ్లప్పుడు మేరీ బొత్తిగా మాట్లాడలేక పోయేది——ఎందు కంటే ఆమె తల్లికి ఆమెతో కులాసాగా కబుర్లు చెప్పడానికి టైముండేది గాదు, అది గాక సంఘూవసరం కోసరం మామూలుగాయుండే మాట్లాడవలసిన అవసరం ఆ పిల్లకూ ఉండేది గాదు. నర్సరీలో పెట్టిన కొద్ది కాలంలోనే మాట్లాడ్డం మొదలెట్టి చప్పుచప్పున నేర్చేసుకుంది——ఎందుకంటే 'చుట్టూ తనతో నున్న వారితో మాట్లాడవలసిన అవసరం ఉంది, అదీగాక తన మాటలు వినడానికి తనకు మాటలు నేర్పడానికి తన చుట్టూనున్నవారు సర్దాచూపించేవారు కూడాను. ఇలాగే ప్రతీ పిల్లకుగాని పిల్లవానికిగాని ఏవేవో కొన్ని అవకాశాలు వాళ్ల యింట్లో లోపించినవి యిక్కడ లభిస్తుంటాయి.

**నర్సరీ స్కూల్లో దినచర్య** నర్సరీ స్కూళ్లను గురించి బాగా తెలియ జెప్పాలంటే అక్కడి దినచర్య వర్ణించవలసియుంది. ప్రతీ పిల్ల పిల్లవాడితో ఉపాధ్యాయినీ బృందం మంచి బాగా పరిచయంతో మెలగడానికి పిల్లల సంఖ్య తక్కువగా ఉంచుకుంటారు. 2-5 ఏళ్ల పిల్లలు 30 మందికి ఒక పంతులమ్మాను ఆమెకు సహాయం చేయడానికి ఒక పెద్ద అమ్మాయిని ఉంటారు; 2-3 ఏళ్ల పిల్లలైతే 15 మందికే యీ యిద్దరూ యుంటారు. వీరితో స్కూలు యజమానిగా ఒక సూపరింటెండెంటు ఉపాధ్యాయిని ఉంటుంది. ఒక తోట, విశాలమైన స్కూలు బిల్డింగులూ తప్పకుండా అవసరం. ఎడ్యుకేషనల్ ఆక్టు యివి ఇంత కంటె తక్కువ విస్తీర్ణం కలవిగా ఉండడానికి వీల్లేదు అని శాసిస్తుంది. ఇంకా పిల్లలు దుస్తులు వేసుకొనే గదులు, స్నానాలు చేసే గదులు, పాయిఖానా ప్రదేశాలూ, వైద్య సౌకర్యాలు, బట్టలు ఎండవేసుకొనే చోట్లు, వంట గదులూ

వగైరాల విషయంలోకూడా అలాంటి నిర్ణయమేవుంది. ప్రొద్దుట 8½ గంటలనుంచి పిల్లలు తమ తల్లిదండ్రులతోను, మిత్రులతోను, అన్నలు, చెల్లెళ్లతోను రావడం ప్రారంభిస్తారు. ప్రతీ పిల్ల, పిల్లాణ్ణి మిత్రభావంతో ఆహ్వానించడానికీ అక్కడి వారంతా అలాంటి భావంతో ఉన్నట్లు నచ్చేటట్లు చేయడానికీ, తాను హాయిగా అక్కడనుండవచ్చునని తోపింపజేయడానికీ—ఉపాధ్యాయిని అక్కడ సిద్ధంగా యుంటుంది. శారీరికంగాగాని, మానసికంగాగాని అసహజ పరిస్థితులేవైనా ఉంటే తక్షణమే గుర్తించి ఉంచుకుని అప్పటికప్పుడే గాని తర్వాతగాని విచారిస్తుంది. రాగానే ఆటలు ప్రారంభం. వచ్చిన పిల్లగాని పిల్లవాడుగాని తనకు యిష్టమైన ఆటలోకి జేరుకుంటారు. మేష్టరమ్మగారు వాళ్ల శరీరానికి అవసరమైనవి మాత్రం మరచిపోకుండా ఉండి, వాళ్ల ఆటలకు అట్టే అంతరాయం కల్పించకుండా ముఖం చేతులూ కడుక్కోవాలని, తర్వాత 10 గంటలప్పుడు కాడ్ లివర్ ఆయిలు, పాలు తీసుకోవాలని జ్ఞాపకం చేసి యిస్తుంది. ఈ లోపులో ఆటలు అనేక రకాలుగా ఇంట్లోనే గాని, బయటగాని వాళ్ల వాళ్ల కిష్టమైనట్టు జరుగుతూనే ఉంటాయి. చాల కాలం ఆడుకోనివ్వడంవల్ల—పిల్లలు తమ బుద్ధిని చాతుర్యాన్ని కేంద్రీకరింపజేసి సహజరీతిని ప్రోత్సాహించడానికి తోడ్పడుతుంది, అదిగాక తాము ప్రారంభించిన పనులేవైనా పూర్తిజేయడానికి అవసరమైన టైము యివ్వడం అవుతుంది. ఇందుకు ఉదాహరణ చెప్పాలంటే—పాత పెట్టెలు, బట్టలు, త్రాళ్లతోటి నాలుగేళ్ల శిశువు 'ఓడ' నిర్మించడానికి గంటన్నర కృషి చేసింది. ఆడుకొందుకు అసంఖ్యాకమైనవి అంత పెద్ద పెద్దవీయైన వస్తుజాలం అట్టే అక్కర లేదని, అలాయిస్తే పిల్లలు తమ ప్రయత్నాన్ని క్రియలో పెట్టడానికి, వాళ్ల మానసిక ప్రవృత్తిని ఒక సృష్టి కార్యంలో నిమగ్నుల్ని చేయడానికి తోడ్పడదని బుజువైంది. అందుచేత నర్సరీ స్కూళ్లలో పిల్లల ఆటలకోసరం ఉంచేవి—ఇసుక, నీరు, బంకమట్టి, పిండి ముద్ద, రంగు పెయింట్లు, పిల్లల ఆట బొమ్మలు, చిన్న చిన్న పనిముట్లతోచేసే వడ్రంపనులు, ఉత్తుత్తి ఆటలు ఆడుకోడానికి చిన్న చిన్న యిళ్లు, షాపులతోబాటు బస్ డ్రయివరు, పోస్టుమేన్ వగైరాల దుస్తులు మొదలైనవి. పెద్ద ఆట బొమ్మలు, పిల్లలు ఎక్కటానికి చట్రాల ఫ్రేములు, బల్లలు, దూలం, కర్రలు వగైరాలు నర్సరీ స్కూళ్లల్లో తప్పక ఉండేవేనని చెప్పవచ్చు.

సాధారణంగా 12 గంటలకు భోజనాలుంటాయి; కాని, అంతకు ముందు పిల్లలిందుకు తయారు కావాలి—ఆట వస్తువులు యథారీతిగా విడిచి పుచ్చేసి, చేతులు ముఖం కడుక్కోవడం, స్నానం చేయడం, జుట్టు దువ్వుకుని క్రమరీతిని సర్దుకోవడం వగైరా పనులుంటాయి, వీటిల్లో వీలైనంత వరకు పిల్లలు తమ స్వబుద్ధి నుపయోగించుకోనేటందుకై ప్రోత్సాహింపబడతారు, గాని అవసరమైతే సహాయం చేయడానికి పంతులమ్మగారు అక్కడే సిద్ధంగా ఉంటారు. ఆ వెనుక పిల్లల్ని గుమిగూడ్చే పనులుంటాయి—కథలు చెప్పడం పాటలు, సంగీతం వగైరాలు. పిల్లలకు యిష్టమైతే తప్ప వీటిల్లో జేర నక్కరలేదు గాని "మూడు ఎలుగు బంట్లు" "చిన్న బొగ్గుబండి", "పిల్లి—పిల్లలు" వంటి కథలు, ఎప్పుడూ పిల్లలకు మనోరంజకంగానే ఉంటాయి. పాటలు, సంగీతాలు నేర్చుకునే టైముకు వాళ్ల కవి నిత్యజీవితంలో అలవాటైపోతాయి. ఇక భోజనాలు 'పిల్లలు చిన్న చిన్న కుర్చీల్లో అట్టే ఎత్తులేని బల్లల దగ్గర కూర్చుని తింటారు. తమకు తామే సహాయం చేసుకుంటూ తింటారు. లేదా సహాయం చేసేవాళ్లుంటే, తమ కందరికీ వడ్డించే పెద్దవాళ్ల చుట్టూ చిన్న చిన్న గుంపులుగా, చేరతారు—ఇంట్లో వడ్డించే తల్లి చుట్టూ కూర్చుని తిన్నట్టు). భోజనానంతరం పళ్లు శుభ్రంచేసుకోవడం, టాయిలెట్టు, జరుగుతుంది. అప్పుడు విశ్రాంతి కావలసిన కొందరు చిన్న పిల్లలు (ముఖ్యంగా క్రిక్కిరిసిన యిళ్లల్లో నుండే వాళ్లు) తోటలో వీలున్న చోటనల్లా పరుంటారు. మరి కొందరు నిశ్శబ్దంగా కూర్చుని పుస్తకాలతోటి, జిగ్-సాలతోటి కాలక్షేపం చేస్తారు. ఒక్కొక్కప్పుడు పిల్లలంతాకూడా కొంచంసేపు తమ తమ పాన్పుల మీద పరుండడం సాధ్యమని తోస్తుంది.

గట్టి కార్యక్రమ మేమీ ఉండదు విశ్రాంతి అనంతరం పిల్లలు నారింజ రసం త్రాగడానికి లేస్తారు. ప్రత్యే

కంగా ఏ పొలాలో చూడ్డానికని, ఫైరు ఇంజను ఎక్కడ కాపరంచేస్తుందో! చూడ్డానికని, పోష్టుమేన్ ఉత్తరాలు ఎక్కడనుంచి తెస్తాడో తెలుసుకోడానికని, ఇలాంటి ప్రయాణాలేమీ లేకపోతే, మళ్లీ ఇంట్లోనూ బయటా సాయంత్ర 'టీ' టైము వరకూగాని, తల్లిదండ్రులు యింటికి తీసుకుపోడానికి వచ్చేవరకూగాని ఆడుకుంటూయుంటారు. ఈ టైములో స్కూలు పంతులమ్మలు పిల్లల బంధువులతో వీర్ని గురించి చెప్పవలసిన విషయాలేమైనా ఉంటే వెళ్లి కలుసుకుంటారు. తల్లిదండ్రుల క్లబ్బులని నెలకొకసారి యీ స్కూళ్లల్లోనే సమావేశమౌతుంటారు, అప్పుడింకా వారివారి పిల్లల ప్రవర్తన, నర్సరీ జీవితాల్ని గురించి విశదంగా చర్చించుకోడానికి అవకాశాలుంటాయి. ఇంకా ఈ అన్యోన్యతకు చక్కటి ఉదాహరణలుంటాయి. తండ్రులు నర్సరీ కోసరం అనేక పనులు చక్కబెడతారు—ఆటవస్తువులు చేయడం, పాడైన వాటిని బాగు చేయడం వంటివి. తల్లులు కొత్త చలికోట్లు కుట్టడం, తెరలు కుట్టడం వగైరా పనులు చేస్తారు. అంటే వారు నర్సరీ స్కూలుతో సన్నిహిత సంబంధం కలిగి ఉన్నామనీ దాని బాధ్యతలు తామకూడా పంచుకుంటున్నామని సూచిస్తాయి—యీ పనులు.

ఈ చెప్పిన దాన్ని బట్టి నర్సరీ స్కూళ్లల్లో గట్టిగా ఒక నిర్ణీత కార్యక్రమమంటూ ఉండదని తెలిసేయుంటుంది. ఇళ్లల్లోలాగే దినచర్యలో కొన్ని మార్పులుంటుంటాయి. నర్సరీ స్కూళ్లల్లో పని చేయాలంటే చాల ప్రయాసపడగలిగి ఉండాలి. ప్రేమ, విధి నిర్వహణయందు శ్రద్ధ, ఓర్పు పిల్లల్ని ప్రేమ ఆదరణలతో ఆకర్షించుకుని నడిపించే సామర్థ్యం వగైరాలుండాలి. నర్సరీ స్కూలు ఉపాధ్యాయినులకు తర్ఫీ దివ్వడానికి ప్రత్యేక స్కూళ్లు, కాలేజీలున్నాయి వీటిల్లో నేర్చుకొనే వాటిలో ఒక హంశం పంతులమ్మగారు పిల్లల అవసరాల్ని గుర్తెరిగినదై, వాటినెలా తీర్చాలో తెలిసినదై ఉండాలి. అందులోను పిల్లల సహజ అభివృద్ధి నరికట్టకుండా, వాళ్ల వ్యక్తిత్వానికి భంగంకలిగించకుండా చక్కబెట్టగలిగేదై యుండాలి చెప్పనక్కరలేకుండానే క్రమంగా పిల్లలు పెద్దవాళ్లయ్యేక ప్రపంచంలో ప్రవర్తించవలసిన పద్ధతుల్లోకి క్రమంగా వాళ్లని ప్రవేశపెట్టాలి వాళ్ల శరీరావసరాలన్నీ కనిపెట్టి చూస్తూనే యిది సాధించాలి క్లుప్తంగా చెప్పాలంటే పిల్లల కవసరమైన సమగ్ర తర్ఫీదునంతా నర్సరీ ఉపాధ్యాయిని యివ్వగలుగుతుంది. వారి శరీర మానసికాభివృద్ధుల్లో ఏ ఒక్క చిన్న హంశమూ అశ్రద్ధ చెయబడకుండా అన్నీ సమానంగా అభివృద్ధి పొందుతాయి. నర్సరీ స్కూళ్లి ఉపాధ్యాయినుల ఆశయం ఏమిటంటే—పిల్లలు తమ యింట్లోను, ఇరుగుపొరుగుల్లోను చక్కగా ఎదుగుతూ ఆ యా వయస్సుల్లోను తమ భావిజీవితాల్లోను సర్వవిధాలా సామర్థ్యవంతులై యుండి, హాయిగా ఉత్సాహంతో జీవించేటట్లు చేయాలన్నదే.





# మాలతి పట్టుదల

మాలతి నేను ఇకమీదట బడికి పోనే'

తల్లి: అదేమిటే అలా చెబుతావ్ ?

మాలతి నాజుట్టు చాల పొట్టిగావుందికదూ! అంచేత బడిలో అందరూ నన్ను ఎలకతోక, ఎలకతోక అని పిలిచి హేళన చేస్తున్నారు. నా వెంట్రుకలు సాఫుగా లేకుండా చుట్టుకు వుండడంచేత ప్రక్కయింటి అలమేలు నన్నుచూచి కుక్కతోకా అని అరుస్తుంది, అందువల్ల నేను బడికి వెళ్లనే (అని ఏడుస్తుంది)

తల్లి: బాగుంది నీ ఏడ్పు — నీకు జుట్టు ఎక్కువ లేకపోతే దానికి ఎవరేమి చేస్తారు? మర్యాదగా బడికి వెళ్తావా? లేకపోతే వీపుమీద కొంచు ...




ప్రేమ' కొట్టకేఅత్తా, కొట్టకు. కొన్ని రోజులక్రితం నాకుకూడ 'మాలతి జుట్టు మాదిరి, జుట్టు చాల కొద్దిగా వుండేది ఎవరో చెబితే మా అమ్మ నాకు జాబ్‌కో హైర్ గ్రోయర్ రాయడం ప్రారంభించింది అది రాసినప్పటినుండి జుట్టు అసలు రాలడం లేదు ఆ తర్వాత కొద్ది రోజులలోనే నల్లటి జుట్టు నిగనిగలాడుతూ పెరగడం ప్రారంభించింది

తల్లి విన్నావా మాలతీ, ప్రేమ ఏమి చెబుతుందో? ఇప్పుడు అల్లరిచేయకుండా బడికి పో. డబ్బు యిదిగో. సాయంకాలం వచ్చేటప్పుడు నీవే ఒక సీసా జాబ్‌కో హైర్ గ్రోయర్ తీసుకురా.

— విల్లయు పెట్టలు వుపయోగించండి —

★ జాబ్‌కో హెయిర్ గ్రోయర్ ★

జుట్టు రాలడం మాన్పి, జుట్టు ఒత్తుగా పొడవుగా పెరిగేటట్లు చేస్తుంది.

# మహిళలలో జాగృతి

## స్త్రీ విద్యాభివర్ధనీ సమాజము, నరసరావుపేట

ఈ సమాజ వార్షికోత్సవము ఈనెల 19, 20 తారీకు లందు జరిగెను. 19 తేదీన మిస్ కీన్సు, 20 తేదీన శ్రీమతి జి. శేషారత్నమ్మగారును అధ్యక్షత వహించిరి. ఉదయమున సరస్వతీ పూజతో ప్రారంభమై, ఆటలలో బాలికలకు పోటీలు జరిగెను. సంగీతము, గొబ్బి కోలాటము, కృష్ణ లీలలు, పద్యపఠనములు, ప్రహసనములు జరిగెను మరు నాడు ఆటలలో పోటీలు, సంగీతము, నాటకములు, నృత్యములు జరిగెను. ఆటపాటలలో గెలుపొందినవారికి బహుమతులీయబడెను. అధ్యక్షురాలి తుదిపలుకులు, వందన సమర్పణము మంగళముతో సభలు జయప్రదముగ ముగిసెను.

—వి. సీతామహాలక్ష్మమ్మ.

## పోడూరు మహిళా సంఘం

మార్చి 3 వ తేదీని పోడూరు గ్రామ మహిళా సంఘ సాధారణ సమావేశము శ్రీమతి పొత్తూరి జానకమ్మగారి అధ్యక్షతను జరిగెను. సభలో నుపన్యసించుచు శ్రీమతి భూపతిరాజు వెంకాయమ్మగారు ప్రస్తుత మహిళా సమస్యల గూర్చి స్త్రీజాతి నిరంతరము కృషిచేయవలయుననియు, జాతీయోద్యమములో ముందడుగు వేయవలయునని ఉద్ఘాటించిరి. ఆ పిమ్మట ఈ క్రింది తీర్మానములు ఆమోదింపబడెను.

1. స్త్రీలకు తండ్రి ఆస్తిలో పురుషునితో సమానముగా ఆస్తి హక్కులు వుండవలెను.

2. భర్త ఆస్తిలో బిడ్డలతో సమానముగా భార్యకు ఆస్తి హక్కు వుండవలెను.

3. వితంతువులకు సంతానములేనపుడు భర్త ఆస్తిమీద సంపూర్ణ హక్కులు వుండవలెను.

4. మదరాసు శాసనసభలో ప్రవేశపెట్టు విడాకుల చట్టముయొక్క కాలపరిమితి 7 సం॥ నుండి 3 సం॥ వరకు తగ్గింపవలెను.

5. ప్రస్తుతము మద్రాసు ప్రభుత్వ నిర్బంధ విధానమును ఈ సంఘమువారు నిరసించుచున్నారు. అచిరకాలములోనే "ప్రజారక్షణచట్టము" రద్దుచేసి కాంగ్రెసు ప్రభుత్వము పౌరసత్వపు హక్కులను నెలకొల్ప ప్రార్థించుచున్నారు.

—పోడూరి శారదాదేవి.



# ప్రేమ

ఈనాటి బాహ్యప్రపంచకము చాలా విసుగు పుట్టించుచున్నది. దీనికి కారణం లేకపోలేదు. గతమాసం పత్రికలో 'ప్రేమ' అనే శీర్షిక చదవడంతోడనే, సోదరి సుగుణమణి చెప్పినట్లు "ప్రేమయే లోకం, లోకమే ప్రేమ, సృష్టిలోని పరమాణువు దగ్గరనుంచి ప్రతీదీ ప్రేమచేతనే ఆకర్షింపబడుచున్నది సృష్టిఅంతా ప్రేమమయం, సృష్టికర్త ప్రేమ స్వరూపుడు' ఇటువంటి ప్రేమమయ జగత్తునందుపుట్టి మానవులు యీ ప్రేమను తెలుసుకోలేక జీవితము నీటిబుడగలతో సమానము అనేమాట మర్చిపోయి హింసా ప్రవృత్తిలో మునిగివున్నారంటే నిజంగా వాళ్లు ప్రపంచకాన్ని అర్థంచేసుకో లేకపోతున్నారు. ఆంధ్ర మహిళలో యీ వ్యాసం అర్థం చేసుకున్నవాళ్లు ఎంత మంది వుంటారో కాని చివరికి సోదరి వ్రాసినట్లుగా కొంచము ఊహించి ఎప్పటికైన ప్రతిజీవి ఈ లాంటి ప్రేమను అర్థం చేసుకొని తీరాలి. అప్పుడే జీవితం సార్థక్య మౌతుందని చెప్పిన సోదరి మాటలకు ధన్యవాదాలు.

—ఒక సోదరి.



వాహినీవారి యోగి వేమన్నలో
శ్రీమతి రాజమ్మ



### ఉషాసుందరి

పౌరాణిక నాటకము, పైడిపాటి సుబ్బరామశాస్త్రిగారు రచించినది. వెల 1-0-0. ఈ పుస్తకము కావలసినవారు పైడిపాటి ఆఫీసు, బెజవాడనుంచి పొందగలరు.

ఇది పురాణగాథ అయినప్పటికి దీనియందలి నవ్యసాహిత్యము, ఆధునిక పోకడల నాగరీకుల నాకర్షించునవిగా ఉన్నవి పౌరాణిక గాథయగుటచే ప్రాంధసులకు ప్రియమైనదీ పుస్తకము.

### క్రాంతిగీతాలు

పద్యకావ్యము. కాశీ విశ్వనాథంగారి విరచితము. వెల 0-4-0. ఇందలి అగష్టువీరుల దేశభక్తి పూర్ణమైన వీరచరిత్ర ప్రతియొక్కరిని దేశసేవకులుగా చేయగలిగినది.

### బెంగాలు గ్రామజీవితము నాశనమౌతూంది

ఈ పుస్తకము భవానీ సేన రచించినదానికి అ. సుబ్బారావుగారి అనువాదము. వెల 0-4-0, దీనియందు బెంగాలులో క్షామము ఎట్లు వచ్చినదో, దాని అభివృద్ధికి కారణము, దీనిచే అచ్చటి లక్షలాదిజనులు తిండికి, బట్టకు, ఒక టేమిటి అన్ని విధముల బాధలకు ఏలాగు గురియై, మృత్యుదేవతకాహుతి కావలసివచ్చెనో మొదలైన విషయములు వివరింపబడినవి ముఖ్యముగా బెంగాలు ప్రభుత్వము (ముస్లిమ్ లీగు) ఎంత బాధ్యతారహితముగాను, స్వలాభముతోను రాజ్యపాలన చేయుచున్నదో, బాగా తెలుసుకొనవచ్చును

### కల్పభూజము

ఇది కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారిచే రచింపబడినది. పద్యకావ్యము. వెల తెలియదు మారుతి రామా అండ్ కో, బెజవాడలో దొరుకును దాదాపు 80 పుటల పుస్తకము చదువుట కింపుగానున్న పద్యములచే సంతోషము గూర్చును.

### మహిళాప్రబోధం

ఇది కాశీ విశ్వనాథంగారి గేయముల సమీకరణ వెల 0-5-0. ఈ గేయములు బాల్య-బాలికలకుకూడా అర్థమగునట్లును, పాడుటకు సరదా కల్పించునవిగాను ఉన్నవి.

(ఆర్. రమాబాయి)

### ఉదయభాను

ఈ పత్రిక మద్రాసు బాల సంఘం బాలురచేత ప్రచురింపడుచున్నప్పటికి పత్రిక చూచినంతనే ఉదయభాను నిజంగా ఉదయించి తన జ్యోతిని ఆలా వెలిగిస్తున్నాడా అనట్లువుంది. ఆ ప్రతికకు కళ అంతా వాళ్లు చెతితో వ్రాసిన ఆ బొమ్మలయందు దస్తూరీయందు కనుపించుచున్నది ప్రెస్సులో ముద్రించి పత్రికకు అందం తీసుకురావడం ఒక గొప్ప కాదు పోనీ వాళ్లకు పెద్ద వారవరేనా సహాయం చేసారేమో అంటే వాళ్లు రాసిన శైలి చూస్తే తెలిసిపోతుంది వాళ్లవే ఆభావాలన్నీ అనీ. వాళ్లు ఎడ్వర్టైజుమెంట్లుకూడా చిత్రించారంటే అసాధ్యులన్నమాట. కళమీద వాళ్లకి ఎంత అభిరుచంటే కళమీద వాళ్ల వ్యాసంకూడా వ్రాశారు సమస్యలుకూడా పెట్టి వాటిని పరిష్కారం చేయమంటున్నారు. వాళ్లు పూర్తిగా పత్రికా నిర్వాహకులని కవరు పేజీనుంచి చివర పేజీ వరకు తెలిసిపోతున్నది ఈశ్వరుడు ఉదయభానును చిరాయువుగా దీవించు గాక

(సుశీల)

### హరిజన విజయం

హరిజన విజయము అనే పుస్తకములో రచయిత శ్రీ మునగపాటి విశ్వనాథశాస్త్రిగారు హరిజనుల కష్టాల్ని అగ్రజాతివారి నిరంకుశత్వాన్ని చక్కగా కండ్లకు కట్టినట్టు వర్ణించారు అజ్ఞానులు, అశిక్షితులు అయిన భారత ప్రజానీకంలో కేవలం ఉపన్యాసాల ద్వారానే కాక బుర్ర కథలు వీధి భాగవతాలు మొదలయిన వాటి ద్వారా అమోఘమైన చైతన్యాన్ని కలిగించ కలుగుతాం. యీ దృష్టితో చూస్తే రచయిత తన ఈ చిన్న పొత్తం ద్వారా హరిజనుల కష్టాన్ని చిత్రించి గొప్ప మేలును కలుగజేసారనటంలో ఎంత మాత్రం అతిశయోక్తిలేదు. భాష సులభంగాను సరళంగాను వుండుట చేత సామాన్య ప్రజానీకంకూడ సులువుగా అవగాహనచేసుకోగలరు. సుందరరాం అండ్ సన్సు, తెనాలినుండి పబ్లిష్ చేయబడినది. వెల 0-6-0.

(రత్నావళి)

★ గ్రంధసమీక్ష ★

Edited and published by G Durgabai, M A , B L , at the Andhra Mahila Sabha, Mylapore, Madras
Printed by M Satyanarayana at the Hindi Prachar Press, 12, Thanikachalam Chetty Road, T'Nagar, Madras

